# ఛందోవ్యాసావళి

డా॥ నడుపల్లి శ్రీరామరాజు



# ఛందో వ్యాసావళి

తెలుగు ఛందస్సునకు సంబంధించిన ఎనిమిది పరిశోధక వ్యాసములు

రచయిత

డా॥ ఎన్. ఎస్. రాజు

ఎమ్. ఏ., పిహెచ్. డి., డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్

హైదరాబాదు విశ్వవిద్యాలయం

(కేంద్రీయ విశ్వవిద్యాలయం)

హైదరాబాదు.

శ్రీసత్య ప్రచురణలు

నం. 9-4-84/69, కాకతీయనగర్

హైదరాబాదు-8

# Chando Vyasavali

(Eight research papers on Telugu Prosody)

by

Dr. N. S. Raju, M. A., Ph. D., P. G. Dip. in Ling.
University of Hyderabad
(Cantral University P.O.)
Hyderabad-500 134

ప్రథమ ముద్రణ : జూలై, 1983

ప్రతులు : 1000



మూల్యము : రూ. [redacted] 12-00

ముఖపత్ర రచన :
శ్రీ రవీంద్రరెడ్డి

ముద్రణ :
శ్రీనివాసా ప్రింటర్స్
తిలక్ నగర్
హైదరాబాదు - 44




Publishers:

Sri Satya Prachuranalu
H No. 9-4-84/69
Kakatiyanagar
Hyderabad-500 008.

గ్రంథస్వీకర్త

కళాప్రపూర్ణ ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని గారు



శాంత గంభీర వాఙ్మయ చక్రవర్తి
తత్త్వమార్గ ప్రవర్తి వాత్సల్య మూర్తి
ఘనత నాచార్య పదవికి కలుగజేసి
వరలు నవధానిగారికి వారెసాటి.

నా యీ వ్యాసాంబుజముల
కాయన కరుణయె దివాకరాలోకనమౌ
దీయుతున కట్టి గురునకు
శ్రేయము నర్థించి 'కృతి'గ చేయుదు దీనిన్.

# ప్రకాశకుల విజ్ఞప్తి

విద్యార్థుల్లో వ్యుత్పత్తిజ్ఞానం పెంపొందించే గ్రంథాలను ప్రచురింప తలపెట్టిన మా ప్రణాళికలోని తొలి ప్రయత్నం ఇది. ఈ ప్రయత్నంలో భాగంగా తెలుగులో వెలువడిన పరిశోధక రచనలు పదిమందికీ అందే టట్లు చేస్తే, ఆయా పరిశోధక ఫలితాలు జిజ్ఞాసువుల కెంతగానో ఉపకరిస్తా యని మేం భావించాము. మా భావానికోరూపం ఏర్పడడానికి తమ పరిశో ధక గ్రంథాన్ని ప్రచురించే అవకాశం మాకిచ్చినవారు డా॥ ఎన్. ఎస్. రాజుగారు. ఆ విధంగా ఈ 'ఛందో వ్యాసావళి' గ్రంథాన్ని ప్రచురించ డానికి అనుమతించిన డా॥ రాజుగారికి మా కృతజ్ఞతాపూర్వక వందనాలు. ఈ గ్రంథాన్ని శ్రద్ధతో ముద్రించిన శ్రీ శ్రీనివాసా ప్రింటర్స్, న్యూ నల్ల కుంట, హైదరాబాదు వారికి; ప్రత్యేకంగా మా కండగా నిల్చిన డా॥ ఎన్. శివరామమూర్తిగారికి మా కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు. ఇది ఆంధ్రభాషాభిమానుల మన్ననలకు పాత్రమైతే మేం కృతకృత్యులమైనట్లే.

శ్రీసత్య ప్రచురణలు

యతిప్రాసలు యమకాది శబ్దాలంకారాల వంటివనీ, యివి ఛంద స్సును అలంకరిస్తున్నాయి కాబట్టి ఛందోఽలంకారాలనీ వీరు భావించారు. అయితే యమకాదులు ఐచ్ఛికాలు కాగా, యతిప్రాసలు తెలుగు ఛందస్సునకు నియతాలు. అందునా ప్రాసనియమం దేశిచ్ఛందస్సులో చాలా పద్యాలకు లేదు. ఈ భేదాన్ని కూడా వీరు గుర్తించి వీటి అలంకారతను ప్రతిపాదించి, యితర ద్రావిడభాషా ఛందస్సులతో గల సామ్య వైషమ్యాలను మొదటి వ్యాసంలో ముచ్చటించారు.

అప్పకవి చెప్పిన నలభై రెండు యతిభేదాలలో ఏవి అవసరం ఏవి అన వసరం అనే విషయాన్ని 'యతిపరిశీలనము-క్రొత్తయతులు' శీర్షికకింద సుదీ ర్ఘంగా చర్చించారు. కొత్తగా కొన్ని అక్షరాలకు మైత్రి చెల్లుతుందని చెబితే అది యతిభేద మవుతుందనీ, అలా కాకుండా చెప్పినవన్నీ యతినియమాలు అవుతాయే తప్ప యతిభేదాలు కావనీ వీరి ప్రతిపాదన. ఇది పూర్వ వ్యాఖ్యా తలు అంగీకరించిన మార్గమే. ఈ దృష్టితో మైత్రీసూచక యతులూ, నియమ సూచక యతులూ అని యతులను స్థూలంగా రెండురకాలుగా వీరు వర్గీక రించారు. అటుపైని అనావశ్యకమయిన యతులు అంటూ నికరంగా ఆరిం టిని తేల్చారు.

మైత్రీసూచకాలై ఆవశ్యకాలని వీరు భావించిన యతిభేదాలలో కూడా అనావశ్యకాలయినవి కొన్ని వున్నాయి. ఉదాహరణకి;

వర్గ ప్రథమాక్షరాలు నాలుగూ 'పూర్ణబిందు యుతములై' స్వవర్గ పంచమాక్షరంలో మైత్రిని పొందుతాయి. ఇది బిందుయతి. పూర్ణబిందు పూర్వకాలయిన -ట,-త వర్గాక్షరాలకు యతి చెల్లుతుంది. ఇది అనుస్వార సంబంధయతి. పూర్ణబిందు పూర్వకాలైన ట వర్గీయాక్షరాలకు 'న' తోనూ, పూర్ణబిందు పూర్వకాలైన త వర్గీయాక్షరాలకు 'ణ' తోనూ యతి చెల్లుతుంది. ఇది అనునాసికాక్షర యతి. 'న-ణ' లకు యతి చెల్లుతుందని సరసవశి చెబుతూంది. సరసవశినీ, బిందుయతినీ దృష్టిలో ఉంచుకుని యోజిస్తే పూర్ణ బిందుపూర్వకాలయిన ట త వర్ణాక్షరాలు, న ణ లూ పరస్పరం మైత్రిని పొందుతాయనే విషయం స్పష్టపడుతూనే వుంది. కాబట్టి అనుస్వార సంబంధ యతి, అనునాసికసంబంధ యతులనూ స్పష్టప్రతిపత్తి కోసమే

అప్పకవి చెప్పారని ఒప్పుకోవాలి.

అటుపైని, కొత్తగా చెప్పవలసిన యతి మైత్రులను కొన్నింటిని శ్రీ రాజుగారు ప్రస్తావించారు. ఋ ౠ, ఱె ఱే లకు ఋ కారంతో (ఋవళి)యతి చెల్లుతుంది కాబట్టి ఋత్వ మిత్రాలయిన ఇ ఈ ఎ ఏ లకు కూడ ఋ ౠ ఱె ఱే లతో యతి చెల్లుతుందని వీరి భావన. ఇది యుక్తి. కాని యతి మైత్రికి ప్రధాన హేతువు ఉచ్చారణ సామ్యంకదా ! అది లేనప్పుడు చెల్లుతుందని చెప్పడం ఎలా ? 'సారూప్య లక్షణములలో నత్యధిక సన్నిహితత్వము కలిగి యుండు అక్షరములకే యతి మైత్రిచెప్పుట యుక్తము, సంప్రదాయము నైన దని తెలియదగును. తద్విరుద్ధమైన దానికి మైత్రి చెప్పినచోనది యగ్రాహ్య మనబడు చున్నది' (పు. 66)-అన్న వ్యాసకర్తృభిప్రాయాన్ని బట్టిచూస్తే పై ప్రతిపాదనకు మరికొంత వివరణ అవశ్యక మనిపిస్తుంది.

పైగా, వీటిని ప్రమాణీకరించడానికి ప్రాచీన కవి ప్రయోగాలు లేవంటున్నారు. ఆ పక్షంలో ఈ యతిభేదాన్ని చెప్పడంలోని అంతర్యం ఏమిటో స్పష్టపరచవలసివుంది. ఇది భావి కవిలోకానికి సౌలభ్య సంపాద కమా ? ఆధునిక కావ్యాలలోనుంచి యిచ్చిన ఉదాహరణలు రెండింటా ఇంచుగాగమంలోని ఇకారంతోనే యతి వేశారనడానికి వీలుంది. ఇయు డాగమం రానప్పుడుకూడా ఇంచుగికారంతో యతిని ప్రాచీనులే వేశారు కదా ! ఉంచుగాగమంలోనేకాదు-ఎను,.ఎడు,-ఎడి వీటిలో కూడ స్వర యతిని ఆధునికులు వేశారు. తిరుపతివెంకటకవులూ, వారి శిష్యులూ యిటువంటి ప్రయోగాలు చేశారు. సౌందరనందం (ఉపదేశము:34) వీరు చూపిన ప్రయోగం పై మార్గాన కాకుస్వర యతిగా చెల్లుతుంది. ఏమైనప్ప టికీ కొత్తగా గ్రహించవలసిన యతిభేదాలంటూ వీరు ప్రతిపాదించిన ఐదింటిలోనూ లక్షణశిరోమణి అంగీకరించిన నాలుగోభేదం-(పు. 15) తప్ప తక్కిన నాలుగూ బలమైన కవి ప్రయోగాలు దొరికేవరకూ అంగీకారాలు కావనడమే సమంజసం. విశేషించి '....కూర్మి నందన....విజ్ఞాపింప....'ను తద్భవవ్యాజయతిగానూ సమర్థించవచ్చుగదా.

దుష్కర ప్రాసాదుల విన్యాసాన్నీ క్రమవికాసాన్నీ వీరు నిరూపిం చిన తీరు ప్రశంసనీయం. వీరి నిశితపరిశోధనా దృష్టికి యిది చక్కటి.

నిదర్శనం. ఇవి యెక్కువగా దేశిచ్ఛందస్సులోనే కనబడటం ప్రాస స్వభావాన్ని సూచిస్తూందనడం కూడా సమంజసమే.

అంత్యప్రాసకు సంబంధించి ఛందఃకర్తలు చెప్పిన లక్షణాలను 'అంత్యప్రాస - ఒక వివరణము' అన్న వ్యాసంలో క్రోడీకరించారు. వ్యాఖ్యాతలు చేసిన సమన్వయాలను పరామర్శించడంతో పాటు పాదాది ప్రాసాక్షరాన్నే అంత్యప్రాసకు కూడా స్వీకరిస్తే 'లెస్సగా' ఉంటుందన్న రంగకవి సూచనను వీరు వెలికితీసి విపులీకరించారు. అనంతర వ్యాసంలో ప్రాసశబ్దాన్ని నిర్వచించి ఛందఃకర్తలు వివరించిన అనుప్రాసకీ ఆలంకారికులు రూపించిన అనుప్రాసకీ గల భేదాన్ని స్పష్టంగా చిత్రించారు. 'ఛందశ్శాస్త్రమున పద్యపాద ద్వితీయాక్షరమునకు ప్రాసమని సంజ్ఞ యున్నప్పుడు దానియొక్క పునః పునః ప్రయోగమే అనుప్రాస మనబడుట ఛందశ్శాస్త్రమున యుక్తమై యున్నది. ప్రాసాక్షరముకంటె భిన్నమయిన అక్షరముల యొక్క ఆవృత్తి ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన అనుప్రాసము కాదని తెలియదగును' (పుటలు 60-61). ఇది శ్రీరాజుగారి వాదంలోని సారాంశం. ఈ భేదాన్ని కొందరు ఛందఃకర్తలేకాదు వ్యాఖ్యాతలయిన శ్రీయుతులు వేదుల, రావూరి ప్రభృతులుకూడ గుర్తించకపోవడం విశేషం. ఇది వీరి పరిశోధనా ఫలితంగా చెప్పవచ్చు.

అప్పకవి నిరూపించిన అగ్రాహ్యవళులనూ, అగ్రాహ్య ప్రాసలనూ, యితర ఛందఃకర్తల లక్షణాలతో సరిపోల్చి తరువాతివ్యాసంలో సుదీర్ఘంగా చర్చించారు. వీటిలో లక్షణ శిరోమణి అంగీకరించిన ట-తవర్గయతినీ, సంభావన వడినీ (మ-వ), ర-ల యతినీ అంగీకరించాలని బహులక్ష్యలక్షణ పరిశోధనలో వీరు నిష్కర్షించడం శ్లాఘనీయం. ఈ సందర్భంగా కూచిమంచి వెంకటరాయల (సుకవి మనోరంజనము) మార్గాన శకటరేఫ లకారాలకు మైత్రిని సమ్మతించాలని వీరు ప్రతిపాదిస్తూ రామాభ్యుదయం నుంచిఒక ప్రయోగం ఉద్ధరించారు. '....నీ, లిగి కాల్దవ్వు నెలుంగిడుం జెవికవల్ టెక్కించు....'(2-21). ఇది సరియైన లక్ష్యంకాదు. సంయుక్తాక్షరయతి నియమాన్ననుసరించి యిక్కడ లకారానికి లకారంతోనే '....నీ లిగి ....కవల్ టెక్కించు' యతి చెల్లిందనవచ్చుకదా? కాబట్టి ఱ-ల ల మైత్రికి యింకా బల

మైన లక్ష్యాలు ఇచ్చి వుండవలసింది. ఇక్కడ మరొక్క విశేషముంది. 'కవ' యుగళార్థకం కాబట్టి 'కవల్' అన్న బహువచనరూప ప్రయోగం పొరపాటనీ, 'చెవి కవన్ ఱిక్కించు' అని పాఠాన్ని సవరిస్తామనీ అంటారేమో. ఆ పక్షంలో ఈ యతికి అవకాశం వుంటుంది. ఱ–ల లకు యతిప్రాసలు చెల్లిన లక్ష్యా లనేకంకంటవంటూ పాఠాంతరాపేక్షకల యిలాటి లక్ష్యాన్ని ఉట్టంకించద మెందుకు?

ఇక–ఎనిమిదో వ్యాసం. ఇది శ్రీరాజుగారి భాషాశాస్త్ర పరిచయాన్ని ద్రావిడభాషా పరిశీలనాన్ని పట్టియిచ్చే వ్యాసం. శకటరేఫ అనుస్వులను వివరిస్తూ తెలుగులోని సాధు, శకటరేఫాల స్వరూపాలను ఆవిష్కరించడానికి యింపులో ప్రయత్నం జరిగింది. లఘులకారం, అలఘులకారం, వర్ణాంతరమైన లకారం ఉన్నట్లే లఘురేఫం అలఘురేఫం, వర్ణాంతరమైన రేఫం తెలుగులో ప్రవర్తిస్తున్నాయని యీ వ్యాస సారాంశం.

కానీ, శ్రీరాజుగారి ప్రతిపాదనకు బాధకాలనేకం కనిపిస్తున్నాయి. 'ఱ వర్ణము ప్రాచీన కాలమున ట–త మధ్యస్థోచ్చారణము కలిగియున్న ప్రత్యేక వర్ణము....' (పు. 105) ప్రాచీనకాలమంటే తెలుగుభాషయొక్క ప్రాచీన దశయందా? లేక మూలద్రావిడ దశయందా? తెలుగులోని శకటరేఫకు మూలవర్ణం మూలద్రావిడభాష(Proto-Dravidian)లోని దంతమూలీయ స్పర్శం (unvoiced unaspirated apico-alveolar plosive)అనీ, దానికి అపదాదిగానే ప్రవృత్తిఅనీ, అదే పుత్రికాభాషల దశలో అజ్మధ్యస్థితి(inter vocalic position)లో స్పర్శగుణాన్ని కోల్పోయి అధిక కంపిత (more trilled) గుణాన్ని సంక్రమింపచేసుకుని శకటరేఫగా సిద్ధించిందనీ శాస్త్రవిదుల నిర్ణయం.

'వర్ణమాలలోని ఱ–ర లకు తోడుగా ప్రాథమికముగా భిన్నాక్షరమైయుండి ఉచ్చారణమున ననంతర కాలమున రేఫముగా మారిన దానిని అలఘురేఫమని చెప్పవచ్చును. ఒకానొక వర్ణమున కిట్టివిధమైన పరిణామ మేర్పడునాటికి అవర్ణము యొక్క ఉచ్చారణమునకూడ మార్పు సంభవించి రెండింటి ఉచ్చారణమున సామ్యముండుటచే అవర్ణ లేఖన రూపమే దీనికిని

గ్రహింపబడి యుండవచ్చును.' (పు. 106). రాజుగారి ఈ ప్రతిపాదన మరింత వివరణను కోరుతున్నది. ప్రాక్కాలిక శాసనాల లిపితీరును పరికిస్తే ఈ దంతమూలీయ అతికంపిత వర్ణాన్ని నిరూపించే లిపిచిహ్నం బండి చక్రం ⊕ లా కనిపిస్తుంది. క్రమంగా ఈ రేఖాసంకేతం ఎన్నెన్నో మార్పాటులు పొంది నేటికి 'ఱ' గా రూపెత్తింది. బండిచక్రాన్ని పోలిన లిపిచిహ్నం కలిగి – సాధురేఫ మాలికయే శకటరేఫ అంటారు కాబట్టి – యించుమించు సాధురేఫోచ్చారణం కలిగిన ఈ వర్ణాన్ని 'బండిరా' అనీ, దీనిని సంస్కృతీకరించి 'శకటరేఫ' అనీ పరిభాషించడం పరిపాటి అయింది. ఇంతచేసి లఘురేఫ మంటున్న సాధురేఫానికి య, ల, వ లపక్షంగా నిరూపితమయిన లఘ్వలఘు భేదాలకువలె ఏ సన్నివేశాలలో అలఘురేఫోచ్చారణం సిద్ధిస్తుందో చెప్పలేదు. ల–ళ లకు వలెనే భిన్న వర్ణత్వ స్థాపనకై ర–ఱ లకు కూడా – నీరు:నీఱు, మీరు:మీఱు, వేరు:వేఱు వంటి కనిష్ఠభేదక పద యుగళాల(minimal pairs)ను స్పష్టప్రతిపత్తికోసం చూపివుండవలసింది. ఆఱు, ఏఱు, చెఱువు, దూఱు, నూఱు-మొదలయిన పదాలలోని శకటరేఫ మూలద్రావిడ భాషలోని దంతమూలీయ తకారం నుండి యేర్పడ్డది. సాధురేఫకు ద్విత్వస్థితిలేదు. అఱ్ఱు, కొఱ్ఱు,గొఱ్ఱె, బఱ్ఱె-ఇట్టిచోట్ల శకటరేఫమే ప్రవర్తిస్తుంది.

పు. 107 లో ఉల్లేఖితమయిన లిపిచిహ్నం 'ఱ' శకటరేఫమో లేక తమిళభాషలో ழ అన్న రేఖాసంకేతానికి తెలుగులిపి సంకేతమయిన 'ఴ' (మూర్ధన్య పార్శ్వికాంతస్థోష్మ) వర్ణమో స్పష్టంగా లేదు. 'ఴ' కారమన్న భావనతోనే చర్చకుపక్రమిద్దాం. 'ఴ' కారము ముందలఘురేఫముగను, తర్వాత లఘురేఫముగను మార్పునొందినదని యూహింపవచ్చును.(పు. 107) ఈ ఊహ సాధురేఫ మాలికాస్తిత్వానికే యెసరు పెట్టుతున్నది. మూలద్రావిడంలో సాధురేఫ (apico-alveolar flap) కలదనీ అది సాధురేఫగానే జన్యభాషలలో నిలిచిందనీ శాస్త్రకారులు ఏకవాక్యంగా రుజువు చేశారు. పు. 107-19 అధోజ్ఞాపికలో సూచించినట్లుగా వ్రేలు-త్రిప్పులలోని వ్రావడికి మూలవర్ణం 'ఴ' కారమని పేర్కొనడం సుపరీక్షితంకాదు. వాస్తవంగా ఈ రెండు పదాల సంయుక్తతలోని ద్వితీయ వర్ణానికి మూలరూపం మూలద్రావిడంలోని సాధురేఫమేకాని 'ఴ' కారం కానేకాదు.

'వర్ణవ్యత్యయముచే పదాది సంయుక్తాక్షరమున ద్వితీయ వ్యంజనముగా నేర్పడిన రేఫమునకు లోపము సిద్ధించుచున్నట్లయినచో అది అలఘు రేఫము' అని శ్రీరాజుగారి ప్రతిపాదనము. దీనికి అతివ్యాప్తి దోషం వుంది. క్రింద, క్రొత్త, క్రోవి, ప్రాఁత, ప్రవ్వ, ప్రేలు, ప్రొద్దు, ప్రోలు, బ్రతుకు, మ్రింగు-మున్నగు పదాలలోని పదాది సంయుక్తత యందలి ద్వితీయ వర్ణమైన సాధురేఫానికి మూలం మూలద్రావిడభాషాగతమైన 'ఱ' కారమే మూలమని నిష్కర్షించవచ్చుగాని త్రాచు, త్రిప్ప, ద్రొబ్బు, మ్రాను-మొదలైన పదాలలోకూడ సంయుక్తతలోని రేఫ లోపించి తాచు, తిప్ప, దొబ్బు, మాను రూపాలు సిద్ధిస్తున్న కారణంగా ఇందలి రేఫకు మూలం 'ఱ' కారమని నిర్ణయించడం సరికాదు.

సారాంశమేమనగా తెలుగునందలి సాధురేఫ స్థితిని కింది చిత్రంలో వలె ప్రదర్శించవచ్చు.

మూ. ద్రా. 'ఱ'* ————————|
మూ. ద్రా. త (>'ఱ')* ———————తెలుగు 'ర'
మూ. ద్రా. ర* ————————|

అక్కడక్కడ మరికొన్ని సవరణలు యీ వ్యాస సంకలనంలో అవసరమనిపిస్తుంది. మాదిరికి కొన్ని: 'డ-ద' లు క్రమముగా మూర్ధన్యము, దంత్యమునై సమీపోత్పత్తి స్థానములను కలగియున్నవి' (పు. 69). 'డ' కు వర్ణోత్పత్తిస్థానం మూర్ధం. 'ద' కు వర్ణోత్పత్తిస్థానం పై ముందుదంతాల వెనుకభాగం. ఈ రెండు వర్ణోత్పత్తి స్థానాల మధ్య దంతమూలం, కఠిన తాలువు అన్న మరిరెండు వర్ణోత్పత్తిస్థానాలు అమరివున్నాయికదా. రెండింటికీ యింత అంతరం వుండగా సమీపోత్పత్తి స్థానములనడం సమంజసమా; 'డాపల-దాపల....' మున్నగు జంటలలోని డకార ఘటితాలు ప్రాచీనాలు; దకార ఘటితాలర్వాచీనాలు.

'ర-లలు రెండును క్రమముగా మూర్ధన్యము, దంత్యమునై సమీ

పోత్పత్తి స్థానమును కలిగియున్నవి'. ఈ అభిప్రాయం సిద్ధాంతకౌముది నిర్ధారణ కనుప్రాసంకావచ్చు. కానీ తెలుగుల ఉచ్చారణలో ఇవి రెండూ దంతమూలీయాలు. మొదటిది తాడితం; రెండోది పార్శ్వికం. ప్రాతిశాఖ్యల చూపులలోనూ ఇవి దంతమూలీయాలే.

'...భిన్నములయిన లేఖన చిహ్నములుండుటయే ప్రత్యేక వర్ణత్వమున కొక నిదర్శనము' (పు. 98). ఇది అతివ్యాప్తి దోషదూషితం. తెలుగులో అనునాసిక వర్ణాలన్నింటికీ ప్రత్యామ్నాయ లిపిసంకేతం **(cover symbol)** అయిన పారిభాషిక బిందువు (ం)ను భిన్నరేఖాంకితం కారణంగా భిన్నవర్ణంగా నిర్ధారించవచ్చునా.

ల-ళల భిన్నవర్ణత్వాన్ని స్థాపించనెంచి వుదాహరించిన మాటల జంట కల-కళ సనిదైనవి కావు. రెండూ భిన్నభాషాగతాలు. మొదటిది తెలుగుమాట; రెండోది ళకార ప్రభావంచే యేర్పడ్డ సంస్కృతసమం. ఈ రెండు వర్ణాల భిన్నత్వాన్ని స్థాపించడానికి తాలు (పొల్లు)-తాళు (సహించు) వంటి జంటను చూపివుంటే బాగుండేది.

పైన సూచించిన సవరణలూ వివరణలూ చిన్న చిన్న నెరసులు; ఈ పరిశోధనా వ్యాసాల స్థాయికి చెప్పుకోదగ్గ భంగం కలిగించేవికావు. మొత్తం మీద ఈ యెనిమిది వ్యాసాలలోనూ మంచి పరిశోధనా, చక్కటి అవగాహనా, సనిదైన సమన్వయమూ కనబడుతున్నాయి. శాస్త్ర విద్యార్థులకే కాదు; అధ్యాపకులకు సయితం ఇవి బహూపకారకాలు. రచయితకు మనఃపూర్వకమైన అభినందనలు.

- తూమాటి దొణప్ప

---

ఱ-ల. లయతిమైత్రికి "నీలిగి కాల్దివ్వ ....." (పుట-86, 87) అనెడి లక్ష్యమును చూపుట తొందరలో జరిగిన పొరపాటనియు; ఎనిమిదవ వ్యాసము, ఆధునిక భాషాశాస్త్ర గ్రంథములను పరిశీలింపక సంప్రదాయ శాస్త్ర గ్రంథములపై ఆధారపడి రచింపబడినదనియు మనవి.

- గ్రంథకర్త

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం
తెలుగు శాఖ
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జున నగర్

## అభినందన

డాక్టర్ నడుపల్లి శ్రీరామరాజుగారు, నాయందభిమానంతో అభిప్రాయార్థం పంపిన 'ఛందోవ్యాసావళి' అనే ఎనిమిది వ్యాసాల ఛందోవిమర్శ పుస్తకాన్ని స్థాలీపులాకంగా చూచి, ఎంతో ఆనందించాను.

కేంద్రీయ విశ్వవిద్యాలయ కార్యస్థానంలోని ఉద్యోగి, ఛందశ్శాస్త్రంలో కృషి చేసి డాక్టరేటు పట్టం సంపాదించటమే కాక, తమ పరిశోధనలో గల ఉపజ్ఞతా పూర్వకమైన విషయాల్ని వ్యాసరూపంలో ఆవిష్కరిస్తుంటే ఆనందజనకం కాకుండా ఉంటుందా? వీరేకళాశాలలోనో ఉపన్యాసకులై నిత్యజీవితంలో విద్యార్థులకు తాముగా కనుగొన్న సత్యాల్ని బోధిస్తు, వాని నిగ్గుతేల్చే అవకాశం కలవారైతే ఇంకెంత బాగుంటుందో అనిపించింది. 'అధీతిబోధాచరణప్రచారాల' వల్లగాని సమగ్రవ్యక్తిత్వం చేకూరదని కదా! మన పెద్దల ఆశయం. అటువంటి అవకాశం డాక్టర్ రాజుగారికి కలగాలని నా హృదయపూర్వకాకాంక్ష.

ఛందశ్శాస్త్రం మీద తెనుగులో ఇంతవరకు సమగ్రమైన పరిశీలనం జరగలేదు. ఏ ఒకరో చేసినా అది వెలుగు చూడలేదు. ఈ మధ్య అనంఖ్యాక సిద్ధాంత వ్యాసాలు ముద్రితమౌతుంటే కొన్ని మాత్రం వెనుకబడ్డాయి. అంటే వాటి ముద్రణపట్ల తత్కర్తలకంతగా ఆగ్రహం లేదని అర్థం. దానికి కారణం వారికృషిపై వారికి ప్రత్యయం లేదేమో॥

సాహిత్య అకాడమీ ఛందోగ్రంథాలకు కొన్ని వ్యాఖ్యలు ప్రచురించింది. అప్పకవీయాదులకు ప్రత్యేకంగా భావప్రకాశికాదులు వెలువడ్డాయి. వానికంటే ఈ 'వ్యాసావళి' లో వైలక్షణ్యం గోచరిస్తుంది. తానుగా పరిశీలించిన అనేక విషయాలిందులో ఉద్ఘాటితం.

వ్యాకరణానికి, ఛందస్సుకు, అలంకారాలకు ఇప్పుడంతగా ప్రాధాన్యం లేదు. వీటిని అధ్యయనం చేయకపోయినా రచనా వ్యాసంగాని కేవిధమైన అఘాతం లేదు. ఇవి చదువుకొని మరింత నిర్దుష్టంగా, నిర్దిష్టంగా వ్రాయగల్గటముంటదనే అభిప్రాయం అప్పకవి చెప్పాడు : (1-57)

ఛందోఽలంకారాదుల
యందలి పొల్లెల్ల తుదిని వ్యర్థము కావే?
సుందరమగు వాక్యమ్ముల
పొందెఱిగి రచించు బుద్ధిపుట్టక యున్నన్.

ఇప్పటివారు తమకు తోచినట్లు వ్రాస్తుంటారు. అందులోని బాహ్య సౌందర్యం విషయం అంతగా పట్టించుకోరు.

తెలుగులో వెయ్యేండ్లు అంతటి ఉదాత్త హృద్య పద్య విద్య పరిణతి చెందిందంటే, అది ఆ భాషకుగల సహజశక్తిని, తద్వ్యాపీయుల సుస్థిర సౌందర్య దృష్టిని సూచిస్తుందనటం అతిశయోక్తి కాదు. ఈ సందర్భంలో **Edward Sapir** భాషా శాస్త్రజ్ఞుని వాక్యాలు సంస్మరించ దగినవి :

**Latin and Greek verse depends on the principle of contrasting weights ; English verse, on the principle of contrasting stresses ; French verse, on the principles of number and echo; Chinese verse, on the principles of number, echo and contrasting pitches. Each of these rhythmic systems proceeds from the unconscious dynamic habit of the language falling from the lips of the folk. Study carefully the phonetic**

system of a language, above all its dynamic features and you can tell what kind of a verse it has developed or, if history has played pranks with its psychology, what kind of verse it should have developed and some day will' (Language, 1970-P. 230)

ఇప్పుడేశాస్త్రకృషి అయినా విశ్వజనీనంగా సాగాలి. ధ్వని శాస్త్ర నియతి బాగా అవగాహన అయితేకాని, మన పూర్వుల కృషికి బాగా విలువకట్టడం కుదరదు. ఆధునిక రచయితలు యథేచ్ఛగా స్వచ్ఛందమైన ఛందస్సులో రచిస్తున్నారు. కాని ఇది జాతి కెంతవరకు రుచిస్తుందో! రుచించనప్పుడు ముందు ముందు రచయితలు పద్యరచనకే పూనుకోవచ్చు. పద్యరచనే ఆంధ్రజాతి హృద్గతుల్ని బాగా నిరూపించేది అవుతుందేమో! అప్పుడు మళ్లీ మన ఛందోగ్రంథాలపై మక్కువ కల్గవచ్చునేమో! చెప్పలేం.

అందుచేత డాక్టరు రాజుగారి (వీరు భాషాశాస్త్రంకూడ అధ్యయనం చేసినవారు కాబట్టి) భవిష్యత్ వ్యాసంగం ఇంకా విస్తృత ప్రాతిపదికపై సపీర్ సూచించినట్లు సాగాలని ఆకాంక్షిస్తున్నాను.

ఇప్పటి వీరి ఆసక్తిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

బొడ్డుపల్లి పురుషోత్తం

# నివేదనము

ఇది తెలుగు ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన ఎనిమిది పరిశోధక వ్యాసముల సంపుటి. నేను, 1982 అక్టోబరులో డాక్టరేట్ పట్టము పొందిన తరువాత చేసిన పరిశోధన వ్యాసంగమిది.

పరిశోధన దృక్పథములో నొక అంశమును స్వీకరించి, దానికి సంబంధించిన విషయములను సమన్వయపరచి, దానిపై పూర్వము వెలువడిన అభిప్రాయములను సమీక్షించి వ్యాఖ్యాన పూర్వకముగ చర్చించి, స్వీయాభిప్రాయముతో సారాంశమును ప్రకటించుట యనునది పరిశోధన మనిపించుకొనును. సాహిత్యమున విమర్శ యనునదికూడ పరిశోధన యందలి భాగముగనే వ్యవహరింపబడుచున్నది. కాని సాహిత్య శాస్త్రముల పరిశోధన కాపదము పొసగదు. కాగా పరిశోధనమనునదియే విస్తృతార్థమును కలిగి వాఙ్మయ శాఖలన్నిటికిని తగియున్నది. ఈ అభిప్రాయముతో నిందలి వ్యాసములు పరిశోధక వ్యాసములనబడినవి.

వాఙ్మయమున సాధారణముగ సాహిత్య విషయములకంటె శాస్త్ర విషయములందు వెలువడు పరిశోధక రచనల సంఖ్య తక్కువగనుండును. ఛందము సాహిత్యమునకు సంబంధించిన యొక శాస్త్రము. ఇది వేదమునకు చెప్పబడిన షడంగములలో నొకటి.• ఇది సాహిత్యమునకు బహిరాచ్ఛాదన రూపమైయుండి రసవాహిక యగును. ఈ ఛందశ్శాస్త్రముపై పండితాగ్రగణ్యులనేకు లింతకు పూర్వము విస్తృతమైన పరిశ్రమచేసి యుండిన కారణముచే దానినిగూర్చి క్రొత్తగా పరిశోధన చేయుటకేమియు లేదని స్థూల దృష్టి కనిపింపవచ్చును. సూక్ష్మేక్షికతో పరిశీలించిన యెడల కొన్ని విషయములను చర్చించి, నిర్ణయములను ప్రకటింపవలసిన అవశ్యకము

---

• శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనునవి ఆరును వేదాంగములు.

కలదని తెలియగలదు. ఆవిధమైన దృష్టితో కొన్ని అంశముల నెన్నుకొని రచించిన వ్యాసముల సమాహార మీ "ఛందోవ్యాసావళి".

ఇందలి తొలివ్యాసమున యతిప్రాసలు ఛందమున కలంకారములని ప్రతిపాదింపబడినది. యతి పరిశీలనము, ఉభయయతి స్వరూప పరామర్శనము, ఐదు క్రొత్తయతుల నిరూపణము రెండవ వ్యాసమున జరిగినది. పద్యరచనమునకు మాత్రమే సంబంధించిన శబ్దాలంకార ప్రాసలయొక్క ప్రారంభదశా ప్రదర్శనము మూడవ వ్యాసమున కలదు. నాల్గవ వ్యాసమున శబ్దాలంకార ప్రాసల లక్షణ సమన్వయము చూపబడినది. శబ్దాలంకార ప్రాసములందలి అంత్యప్రాస వివరణము, దానిపై లాక్షణికుల అభిప్రాయముల పరామర్శ మొదలగునవి ఐదవ వ్యాసమైనది. ప్రాసానుప్రాసల భేద సాదృశ్యము లారవ వ్యాసమున చర్చింపబడినవి. అప్పకవి చెప్పిన అగ్రాహ్యవళిప్రాసల ఔచిత్యానౌచిత్యముల సమాలోచన మేడవ వ్యాసమున చేయబడినది. రేఫ-శకటరేఫలు లఘ్వలఘు రూపములనియు, శకట రేఫము ప్రత్యేక వర్ణము కాదనియు వ్యాకరణమున చెప్పబడియుండ; ర-ఱలు భిన్నవర్ణములని ఛందశ్శాస్త్రముచే నిర్ధారిత మగుచున్నది. ఈ యభిప్రాయమును సాకల్యముగ పరిశీలించి, వానికి సమన్వయము చూపినచో అలఘురేఫ - అవర్ణములు ప్రాథమికముగ భిన్నములై యుండవచ్చునని ఊహించుట కవకాశము కలుగుచున్నది. చిట్టచివరిదగు ఎనిమిదవ వ్యాసము నందేతద్విషయ వివరణము కావింపబడినది. ఈ విధముగ పైఅంశము

---

ఈ వ్యాసరచనమునకు ఆచార్య శ్రీ తూమాటి దొణప్పగారి సూచనము దోహదకారియైనది. వారు, డాక్టరేట్ పట్టమునకు జరిగిన మౌఖిక పరీక్షలో 'శకట రేఫము వర్ణము కానప్పుడు,ర-ఱలకు మైత్రి నిషిద్ధమని చెప్పుటకు గల కారణమే' మని ప్రశ్నించిరి. నేనప్పుడు చెప్పిన సమాధానమునకు సంతృప్తి నొందక 'ఇంకను పరిశీలింపు' మనిరి. తరువాత, 'ఈ అంశముపై నిజముగ నొక ఎమ్. ఫిల్. పట్టమునకు తగినంత పరిశోధనము చేయదగున'నికూడ వారు సూచన కావించిరి.

లనుగూర్చి నేనూహించినరీతి కొన్ని అభిప్రాయముల నీవ్యాసములందు ప్రకటించితిని. సహృదయు లిందలి దోషములను మన్నించి తెలిపిన యెడల దిద్దుకొనగలవాడనని సవినయముగ మనవి చేసికొనుచున్నాను. ఈ సందర్భమున –

నాకు సాహిత్య తత్త్వోపదేశమొనర్చి నా పరిశోధనరంగమునందే కాక, జీవితరంగమునందును, అకుంఠితమైన మార్గదర్శకత్వము నెరపుచున్న అస్మద్గురువర్యులు కళాప్రపూర్ణ ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని గారికి నమస్సుమాంజలి ఘటింతును.

నా పరిశోధక వ్యాసంగమును సదా ప్రోత్సహించు విద్వన్మణులు కేంద్రీయ విశ్వవిద్యాలయాంధ్రాచార్యులు, ప్రొఫెసర్ కొత్తపల్లి వీరభద్రరావు గారికిని, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికిని, డా॥ శ్రీమతి సి. ఆనందారామం గారికిని వినయాంజలులు సమర్పింతును.

నాపట్ల ఎనలేని ఆదరణ చూపు సౌజన్యమూర్తులు, నాకు పరిశోధ కోత్తేజమును కలిగించు విజ్ఞానతేజోమయులు నగు కేంద్రీయ విశ్వవిద్యాలయోపాధ్యక్షులు, ప్రొఫెసర్ బి. ఎస్. రామకృష్ణగారికిని; నా పరిశోధనము నిరంతరాయముగ సాగుటకు హార్దిక సహకార మందించు సహృదయులు కేంద్రీయ విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్, శ్రీ పి. వి. జార్జి గారికిని కృతజ్ఞతాంజలు లొనర్తును.

ఈ గ్రంథమునందలి కడపటి వ్యాసమును రచించుటకు ప్రేరకులై నా పరిశోధనోత్సుకతను ద్విగుణీకృత మొనర్చిన నాగార్జున విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధిపతులు ఆచార్య శ్రీ తూమాటి దొణప్పగారికి కృతజ్ఞతాబద్ధుడనై యుందును.

నాలోని పరిశోధక జిజ్ఞాసయను జ్యోతిని స్నేహసిక్తము కావించి దేదీప్యమాన మొనర్చిన వారును, నిరుపమాన మైత్రికి ప్రతిరూపులునైన కేంద్రీయ విశ్వవిద్యాలయ 'విజ్ఞానవేదిక' మిత్రబృందము వారిని కొనియాడకుండజాలను.

ఇందలి 'యతిపరిశీలనము-క్రొత్తయతులు' అనెడి వ్యాసమును దయతో ముద్రించిన 'స్రవంతి' (ఆగస్టు, 1982) పత్రికాధిపతులకు ధన్యవాదములు చెప్పుదును.

ఈవ్యాసములు రచించు సందర్భమున నేననేక గ్రంథములను సంప్రతించితిని. ఈవిధముగ సహకారమందించిన గ్రంథ రచయితల కందరికిని నమోవాకము లర్పింతును.

ఆత్మీయతా భావముతో ముఖపత్రమును వ్రాసియిచ్చిన కవిమిత్రుడు శ్రీ రవీంద్రరెడ్డిగారికిని, పరిశోధక విలువలను గుర్తించి గ్రంథప్రచురణ భారము వహించిన శ్రీసత్యప్రచురణల వారికిని హార్దిక నమస్కృతు లొనరింతును.

ఈ సందర్భమున నాకు పరమపూజ్యురాలై నా మనుగడ కాధారమైన నా మాతృదేవత శ్రీమతి ఆదిలక్ష్మిగారికి సభక్తిక ప్రణామము లర్పింతును. నాకన్నివిధముల చేదోడు వాదోడై నిలిచిన నా భార్య చి॥ సౌ॥ అరుణకు నా ఆశీస్సులు.

నడుపల్లి శ్రీరామరాజు

# వ్యాసానుక్రమణిక

# యతిప్రాసలు - ఛందో౽లంకారములు

కావ్యమునకు రసభావాదులు అంతస్స్వరూపమును, ఛందశ్శబ్దములు బాహ్యస్వరూపము నగుచున్నవి. అయినచో కావ్యమునకు గల అలంకారములు అంతస్స్వరూపమునకు అర్థాశ్రయములు కాగా, బాహ్యస్వరూపమునకు శబ్దాశ్రయము లగుచున్నవి.

సమగ్రమైన కావ్యత్వమునకు పద్యముతోపాటు ఛందోబద్ధముకాని కేవల వచనముకూడ సమానముగా తోడ్పడుచుండుట వలన కవిత్వమునకు ఛందము ఐచ్ఛికమగుచున్నది. రసవత్కవిత్వము ఛందమునందు నిబంధింప బడినచో కవితానంద మమందమై యుండును. ఛందోరూపమున నున్న కవిత్వము లయాన్వితమై పఠితల నానందపరవశులను గావించును. ఇట్టి ప్రయోజనము ఛందో విరహితమైన వచనమునకు లేకపోవుచున్నది. అనగా కావ్యము యొక్క బాహ్యశోభను ఛంద మినుమడింపజేయుచున్నదని తెలియుచున్నది. ఈ విధముగ ఛందము అలంకారత్వమును పొందుచున్నది. అనగా ఛందఃప్రయోగము గురులఘువుల మూలమున శబ్దాశ్రయమై శబ్దాలంకార మగుచున్నది. ఛందముతోపాటు తదంగములైన యతిప్రాసలును నియతాక్షర నియమిత స్థాన మైత్రులను కలిగియుండి శబ్దాలంకారము లగుచున్నవి.

"అలంక్రియతే అనేన ఇతి అలంకారః" అని అలంకార శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పుదురు. దేనిచే అలంకరింపబడుచున్నదో అది అలంకార మగుచున్నది. అలంకార శాస్త్రము ననుసరించి యమకాదులును, ఉపమాదులును మాత్రమే అలంకారములు. ఛందోవిధిచే యతి ప్రాసలుకూడ కావ్య సౌందర్యమును ద్విగుణీకృతము గావించుచుండ, అలంకారికులు వానినికూడ అలంకారములని ఏల పేర్కొనలేదనెడి ప్రశ్నకు సమాధానము

చెప్పవలసియున్నది. కావ్యముయొక్క బాహ్యస్వరూపమైన ఛందము కరమ శాస్త్రములవలెనే పరమేశ్వర ప్రసాదితమను విశ్వాసములో అనాదినుండియు ప్రత్యేక శాస్త్రముగ నావిర్భవించి వర్ధిల్లినది. అందువలన ఛందస్సంబంధ మైన విషయములను ప్రస్తావింపవలసిన ఆవశ్యకము అలంకార శాస్త్రమునకు లేకపోయినది.

ఛందశ్శాస్త్రమునందుకూడ యతిప్రాస లలంకారములుగా చెప్పబడవు. "సంపద్విరామ పాదాశ్చ దేవతా స్థాన మక్షరం, వర్ణః స్వరాః విధి ర్వ్యృత్తం ఇతిచ్ఛందో గతో విధిః" అని భరతుడు చెప్పిన ఛందో దశాంగము లందు యతి ఒకయంగమగుచున్నది. తెలుగులో నున్నట్టి ద్వితీయాక్షరప్రాసము సంస్కృతమునందు లేకపోవుటచే దాని ప్రస్తావమందు కానరాదు. "ఆద్యో వర్ణద్వితీయో వర్ణః ప్రాసః" అని వాగనుశాసనుడును, "చరణాద్యక్షరమే వడి చరణంబు ద్వితీయవర్ణ సమితియె ప్రాసంబ"ని కవిజనాశ్రయకారుడును తెలుగు యతిప్రాసల లక్షణములను వక్కాణించిరి కాని, వానిని అలం కారములుగా చెప్పరైరి. యతిప్రాసలు ఛందస్సునకు తద్ద్వారా కవిత్వము నకు శోభాతిశయమును కూర్చునవియైనను; తెలుగు ఛందమున కవి నియత లక్షణములగుటచేత, అలంకారము లైచ్ఛికములై యుండవలయునే కాని నియ తము కారాదనెడి కారణమును పురస్కరించుకొని, వానిని ప్రత్యేకించి అలం కారములుగా ఛందోలాక్షణికులు పేర్కొనలేదు.

శబ్దాలంకారములు అర్థములో ప్రమేయములేక శబ్దము నాశ్రయించి యుండు విధమున యతిప్రాసలును అర్థము నపేక్షింపక అక్షర మైత్రిని మాత్రమే కలిగియుండును. శబ్దాలంకారములందు అక్షర స్థాన భేదమును బట్టి సంఖ్యాభేద మేర్పడియుండ యతి ప్రాసలలో అక్షర మైత్రులపై ఆధారపడి సంఖ్యాభేదమేర్పడినది. శబ్దాలంకార ప్రయోగము ఔచిత్య భాసురముగ నున్నచో సార్థక మగును. లేనిచో కావ్యమును అధమ స్థితికి దిగజార్చును. యతి ప్రాసలు మాత్రము పద్యకవిత్వమునకు పోషక ములైనచో ప్రయోజనకరములగును; కానిచో శబ్దాలంకార తుల్యములై తుష్టిని చేకూర్చునుకాని, వీని వలన కావ్యమున శథమత్వము చేకూరదు. ఇవి ఛందోఽంగములగుటయే దీనికి కారణము. వీనిని లాక్షణికు లలంకార

ములని పేర్కొనకుండుట కిదియు నొక హేతువు. కవి ప్రతిభావంతు డైనచో యతిప్రాసలచేత పద్యశిల్పమున కనల్పముగ నూడిగము చేయించును. అక్షరమైత్రి అప్రయత్నముగ నేర్పడును. అప్పుడవి రసానుకూలము లగును. ప్రయత్నించి కూర్పబడిన యతి ప్రాసలు లక్షణవంతములైనప్పటికిని, ఆత్మగతమైన రసమున కొక్కొక్కప్పుడు ఉపస్కారకములు కాకపోవును. అట్టివానిచే కావ్యత్వమునకు హాని లేకపోయినప్పటికిని రసానందసిద్ధి కవి హేతువులు కాజాలవు. శాబ్దికమైన ప్రయోజనము మాత్రము చేకూరగలదు. కావుననే యతిప్రాసలు కావ్యమున కవశ్యలక్షణములు కారాదనెడి యొక సిద్ధాంత మేర్పడినది. దీనినిబట్టి యతిప్రాసలు సర్వవిధముల శబ్దాలంకారములని నిర్ణయమేర్పడుచున్నది. ఉపజాతులకు ప్రాసనియతి లేకపోవుటయు, యతికి మారు ప్రాసయతి చెల్లుబడి యగుటయు దీనికి నిదర్శనము.

ప్రాచీన కాలమున ఛందోబద్ధమైన పద్యరచనయే కవిత్వముగా వాసికెక్కినప్పుడు యతిప్రాసలు విశిష్టమైన స్థానము నాక్రమించినవి. అవి కవిత్వమున కకళంకమైన శోభను చేకూర్చుచు శాశ్వతమైన ప్రయోజనములను కూడ నొనగూర్చినవి. సంస్కృతాంధ్రచ్ఛందములలో యతిప్రాసల స్వరూపము భిన్న రీతులలో నున్నప్పటికిని రెంటియందును వానికి సముచితమైన స్థానము కలదు. యతిప్రాసల స్వరూప స్వభావములందు తెలుగు, సోదరభాషలైన తమిళ కన్నడములలో సామీప్య సంబంధమును కలిగియున్నది. ఐనప్పటికిని ఆ భాషలలోకంటె తెలుగుననివి సుస్థిరమైన రూపమును పొంది ఛందమున కపరిహార్యములైనవి. ప్రాసనియతి లేని సంస్కృతచ్ఛందమును, యతినియతి లేని కన్నడ చ్ఛందమును, రెండింటి నియతియు నైచ్ఛిక మైనట్టి తమిళచ్ఛందమును తత్తద్భాషా కవిత్వములకు రసోత్కర్షను కలిగించుచునే యున్నవి. యతిప్రాసలు తెలుగు ఛందమునకు నియతమైనట్లు ఆయా భాషా ఛందములకు కాకపోయినను, అందలి కావ్యములు సమగ్రత్వమునందు తీసిపోవునవి కావు. అలాగుననైన మరల తెలుగునకు శబ్దాలంకార తుల్యమైన ఈ యతిప్రాస నియతి ఏలని యడుగ వచ్చును. యతిప్రాసలు లేకపోయినను కావ్యత్వము

నకు భంగము వాటిల్లదనుమాట వాస్తవమైనను; సద్గుణములు, సౌందర్యము కలవారికి అలంకారములు శోభాతిశయమును కలిగించు విధమున యతి ప్రాసలును ఛందమున కలంకారమై కావ్యానందము నధికము కావించు ననుటలో విప్రతిపత్తి లేదు. అనగా కావ్య పఠన శ్రవణములందు ఛందమానందమును కలిగించుటకు యతిప్రాసలు తోడ్పడుచున్నవి. తద్ద్వారా కవిత్వము హృదయముపై చెరగని ముద్ర వేసి, కావ్యోద్దిష్టమైన ప్రయోజనము సిద్ధించుట కుపకరించు చున్నవి. కావున తెలుగు కవిత్వము రసాత్మకమై యలరారుట కివి సౌష్ఠవోపేతములైన అలంకారము లగుచున్నవని చెప్పవచ్చును.

కవిత్వమునకు యమకాది శబ్దాలంకారము లెట్లో యతిప్రాసలును అట్టివే. ఇవి ఛందమునకు భూషణములై యొప్పుచుండుట వలన ఛందోఽలంకారములగు చున్నవి. యమకాద్యలంకారములు అలంకార శాస్త్ర కథితములైనట్లు ఛందోఽలంకారము లైన యతిప్రాసలు తెలుగు ఛంద శ్శాస్త్రము నందు చెప్పబడినవి.

*

# యతి పరిశీలనము - క్రొత్తయతులు

ఉచ్చారణలోని సామ్యధర్మము నాధారముగగాని రెండు వర్ణములకు మైత్రి చెప్పదగును. ఇట్టి మైత్రియే యతిమైత్రికి ప్రాతిపదిక. యతి మైత్రులయందు ఒకే విధమైన లక్షణములుగల కొన్నివర్ణములు ఒక మైత్రి వర్గమగును. వివిధములైన లక్షణములుగల వర్ణములు భిన్న మైత్రి వర్గములుగ నేర్పడి యతిభేద విభజనమునకు హేతువగును. స్వర వ్యంజనములు అక్షరాంగములగుట చేత స్వరవ్యంజనములు రెంటికిని మైత్రి చెప్పబడును. స్వరముల మైత్రి చెప్పునవి స్వరయతులు. వ్యంజన ముల మైత్రి చెప్పునవి వ్యంజనయతులు. యతిమైత్రి నిర్వహణమున కేవల స్వరయతులు ప్రయోగింపబడును కాని కేవల వ్యంజనయతులు ప్రయోగింప బడవు పద, వాక్య మధ్యములందు కేవల వ్యంజనము నకు స్థానము లేకపోవుటయే దీనికి కారణము. వ్యంజనమైత్రి స్వర మైత్రితో కూడియే ప్రయోగింపబడును. కాగా వ్యంజనయతి ప్రాణికి కూర్చు మైత్రిగా పర్యవసించుచున్నది. దీనినిబట్టి యతిమైత్రి పాలనమున స్వరయతి, ప్రాణియతి యని రెండు తెరగులైన విధానము లుండునని తెలియుచున్నది. ఇచ్చట ప్రాణియతి యనిన స్వరహల్సంయోగమైన ప్రాణికి కూర్చు యతిమైత్రియని నిర్ణయము.

స్వరసహితమైన ఒక వ్యంజనమునకు మిత్రస్వర సహితమైన అదే వ్యంజనముతో మైత్రికూర్చుట ప్రాణియతి యని అప్పకవీయ లక్షణము. అందు వ్యంజనమైత్రులు వర్గజయతి, బిందుయతి మొదలుగాగల యతుల మూలమున ప్రకటింపబడినవి. స్వరమైత్రి లేకుండగ వ్యంజన యతులు చెల్లవనెడి ప్రధానలక్షణమును ప్రకటించుటయే ప్రాణియతిని చెప్పుటలో గల అప్పకవి ముఖ్యోద్దేశము. కాని స్వరమైత్రి కల్గియున్నచో ఒక

వ్యంజనమున కదే వ్యంజనముల్ చెల్లు యతి ప్రాదియతియని చెప్పుటలో విశేషములేదు. స్వర హల్సంయోగమైన ప్రాయలు రెంటికి మైత్రి చెప్ప బడినచో దానిని ప్రాదియతి యనుటలోనే విశేషము కలదు. ప్రాదియతులు లక్షణమునందు వ్యంజనయతులుగా చెప్పబడినట్లు గుర్తింపవలెను.

ఏవేని రెండుకాని అంతకంటె ఎక్కువకాని వర్ణములకు సామ్య ధర్మమారోపించి మైత్రి చెప్పిన, ఒక యతి మైత్రి ఏర్పడును. అప్ప కవీయ యతులలో గల యిట్టి యతులను (స్వరమైత్రి వళి, వర్గజయతి మొ॥) 'మైత్రి సూచక యతుల'న దగును. యతిమైత్రి పాటింపవలసిన అక్షరము సంధిగత మైనచో నానంది స్థానమున గల పూర్వ పదాంతగ మును, ఉత్తర పదాదిగమును (అంత్యోష్మసంధివడి-అర్థతి> అల్ + హతి) ఆదేశము (వృద్ధివళి —లోకైక > లోక + ఏక) నైన వర్ణములలో వేనికి మైత్రి కూర్పదగు ననెడి నియమమును సూచించు యతులను కూడ లాక్షణికులు యతి భేదములుగ పరిగణించిరి. ఈ యతులలో యతి స్థానమున నున్న, మైత్రి చెల్లింప దగిన వర్ణములు ప్రకటింపబడు చున్నవి. కావున అప్పకవీయ మందలి యిట్టి యతులను (స్వరప్రధానవళి, వికల్పయతి మొ॥) యతి భేదములుగ పరిగణించుట కంటె 'నియమ సూచక యతుల'ను ప్రత్యేక వర్గముగ తెలుపుట సమంజసము. నిజమునకు మైత్రి సూచక యతులనే యతి భేదములన వలసి యున్నది. నియమ సూచక యతులు యతి భేదములు కాజాలవు.

యతిమైత్రి పాటింప వలసిన యక్షరము స్వరసంధిగత మైన యెడల, అచ్చట స్వరయతికాని వ్యంజన యతికాని వేయవచ్చు ననెడి నియమమును తెలుపునది ఉభయయతి. సాధారణముగ ఏకశబ్దము వలె ఒప్పు నిత్యసమాసాది శబ్దములందే ఉభయ యతి చెల్లును. ఏకశబ్దము వలె భావింపకున్నను స్వరసంధిలో కూడియున్న శబ్దయుగళము నఖండముగ స్వీకరించి వ్యంజన యతి కూర్చుట అఖండయతి యన బడును. అప్పకవి అఖండయతిని సర్వత్ర సమ్మతింపని వాడగుట వలన, శబ్దానుశాసన ప్రభృతి పూర్వకవి జనముల కృతుల లక్ష్యము లను పరిశీలించి, స్వర వ్యంజనోభయ యతులు చెల్లిన పదములను

స్వీకరించి, పండ్రెండు విధములైన ఉభయ యతులను చెప్పినాడు. ఈతడు చెప్పిన యుష్మదస్మ చ్ఛబ్దయతి నిజమున కఖండ యతియే. యుష్మదాజ్ఞ, అస్మదన్వయము వంటి పదములు ఏక శబ్దమువలె కాక శబ్దద్వయ మేళనముగ ప్రస్ఫుటముగ కనబడునట్టివి. యుష్మ దస్మ చ్ఛబ్దయతి అఖండ యతియే కాని వేరు కాదనెడి యభిప్రాయమును వెల్లంకి తాతంభట్టు, కూచిమంచి వేంకట రాయకవి ప్రకటించిరి. అఖండ యతి పట్ల వైముఖ్యముగల అప్పకవి, అఖండయతి కల యుష్మదస్మ చ్ఛబ్దములు నన్నయాదుల కావ్యములందుండుట వలన అంగీకరింప వలసి వచ్చి, ప్రత్యేకమైన యతిగా స్వీకరించి ఉభయ వళులలో చేర్చి నాడు. అఖండయతి చెల్లదగిన పదములలో స్వరయతి వేయుట సామాన్యమగుటచే అఖండయతియు ఉభయ యతియే అగుచున్నది. కావున ఉభయ యతి పాటింప దగిన పదజాలమును సూచించుటకంటె అఖండ యతి నొక్క-దానిని చెప్పిన యెడల నందే ఉభయ యతియు నంతర్గత మగును. కాని ఏకశబ్దము వలె తోపకున్నను స్వరసంధి జరుగు సర్వ పద ద్వయ మేళనము నందును వ్యంజనయతి యంత రమ్యముగ దోపక పోవుటచే నట్టిచోట్ల కేవల స్వర యతులే పాటించుట యుక్త మనియు, వ్యంజన యతులు కూర్పరాదనియు అప్పకవ్యాదులు భావించిరి. కావున అఖండ యతిపట్ల లాక్షణికులు పాక్షిక వైముఖ్యము వహించి స్వర వ్యంజనోభయములకు యతి చెల్లింపదగిన పదములను ప్రత్యేకముగ ఉభయ యతులను శీర్షిక క్రింద చేర్చి యున్నారు. ఎంతటి సామ్యమున్నను ఉభయాఖండయతులలో గల సూక్ష్మ భేదమును గుర్తించి, రెంటిని వేరు చేసి భిన్నమైన యతులుగా ప్రదర్శించుటయే సమంజసము. అప్పకవి ద్వాదశ విధములైన ఉభయ యతులను చెప్పెను. వీనియందు విషయ విస్తరణమే కాని నూత్న విషయ ప్రతిపాదనము లేదు. ఒక్క- ఉభయ యతిని చెప్పిన వీనినన్నిటిని చెప్పినట్లేయగును. అఖండ యతిలోను, ఉభయ యతిలోను యతి చెల్లింప వలసిన నియతి చెప్పబడుటచే వీనిని నియమ సూచక యతులుగా స్వీకరింపవలసి యున్నది.

స్వరవ్యంజనములకగు సంధియందేకాక, వ్యంజనద్వయమునకగు

సంధియందును పాటింపదగు యతిని ఉభయయతి యనదగుననెడి యభి ప్రాయమొకటి యర్వాచీనకాలము నందేర్పడెను. ఇచ్చటనొక విషయము గమనించవలెను. స్వరము, వ్యంజనము అనునవి వర్ణములలోగల ప్రధానమైన రెండు భిన్న వర్గములకు సంకేతములు. ఏదేని ఒక స్వరమును, ఒక వ్యంజనమును సంధిల్లినప్పుడు కొన్ని పదములలో రెండింటికిని విడివిడిగా యతిమైత్రి కూర్పదగును. అనగా కేవలస్వర యతికాని, వ్యంజనయతికాని చెల్లింపదగును. ఇట్టి స్వరవ్యంజన సంధిగతాక్షరమునకు కూర్చుయతిని ఉభయయతి యనుట సమంజసమును సంప్రదాయము నయ్యెను. వ్యంజన ద్వయముయొక్క సంధిగతాక్షరమునకు కూర్చు యతి మైత్రియందు స్వర యతియొక్క ప్రస్తావములేదు. ఇందు కూర్పదగు యతులు వ్యంజనయతులగుటవలన వీనిని ఉభయ యతులందు చెప్పుటలో సామంజస్యములేదు. పిదప స్వరవ్యంజన సంధియందలి యతి నియమమును ప్రకటింపవలసిన యావశ్యకము, ప్రాముఖ్యము కలదు. అనగా అఖండయతి యనంగీకారమగుటచే ఎట్టవోట్లస్వరవ్యంజనోభయయతులు అంగీకరింపదగినవో తెలుపుట కర్తవ్యమై, యవి ఉభయ యతులను పేర వచింపబడినవి. వ్యంజన ద్వయమునకగు సంధియందు పూర్వపర వ్యంజనములను ఉభయ శబ్దమునకు సంకేతముగ గ్రహించినప్పటికిని, వానిలో దేనికైనను యతిమైత్రి కూర్పదగియుండుట సామాన్యమైన విషయమగుటచే నిట్టి సంధియందు ఉభియయతిని ప్రత్యేకించి చెప్పవలసిన అవశ్యకములేదు. అయినను ఇట్టి యతినికూడ ఉభియయతి యనదగుననెడి యభిప్రాయము కలవారైన కూచిమంచి వేంకటరాయకవి, అప్పకవి వ్యంజన యతులంటే చెప్పిన వికల్ప విరమణము (దిక్ + మహితుడు), అంత్యోష్మ సంధి (వాక్ + హరి) వరులను ఉభయయతులలో చేర్చినారు.

ప్రాసయతియందు వళిమైత్రి చెప్పబడక, ప్రాస విశేషముద్వారా యతి లక్షణము సాధింపబడుచున్నది. అనగా యతి స్థానమందు అద్యక్షర వళిమైత్రి చెల్లకపోవుటవలన, దాని తరువాతి యక్షరముతో పాదాదినున్న ప్రాసాక్షరము ప్రాసమైత్రిని కల్గియుండును. పద్యముయొక్క అన్ని పాదములలోని ద్వితీయాక్షరములు (నిలువుగ) మైత్రి కల్గియున్నచో 'ప్రాస' యనియు; ఒక పాదముయొక్క ద్వితీయాక్షరము అదే పాదమునగల యతి

స్థానమునకు తరువాతనున్న యక్షరములో (అర్ధముగ) మైత్రి కల్గి యున్నచో 'ప్రాసయతి' యనియు వ్యవహారము. నిజమునకీ రెంటిటికిని నామమునందు స్వరూపమునందు భేదమేకాని స్వభావమునందు భేదము లేదు. పద్యము లోని పాదాదినిగల ద్వితీయాక్షర మైత్రిని సాధారణముగ ప్రాస యని వ్యవహరించి నప్పుడు, యతి స్థానమున గల ద్వితీయాక్షర మైత్రిని 'యతిప్రాసమ'ని వ్యవహరించుట యుక్తము. కావున దీనిని ప్రాస భేదములందు పరామర్శించుట సమంజసము.

## అనావశ్యకమైన యతులు:-

య, హ లకు అకారములోను; శ, ష, స లకు చ, ఛ, జ, ఝ లలోను మైత్రి, సరసయతియందు చెప్పబడి యుండగా ప్రత్యేకించి య, హ ల మైత్రి ఋజుయతి యనియు; శ, ష, స ల మైత్రి ఊష్మయతి యనియు చెప్పుట పునరుక్తి యగుచున్నది. ఇట్లు చెప్పుట యందెట్టి విశేషమును లేకపోవుటచే ఋజూష్మయతులు రెండు ననావశ్యకములగు చున్నవి.

పు, ఫు, బు, భు, ము లకు యతిమైత్రి కలదు. ఇందలి ముకారము విభక్తి ముకారమైన యెడల ము విభక్తి యతి యనియు, సాధారణ ముకారమైన యెడల ముకారయతి యనియు అప్పకవి రెండు యతులుగ చెప్పెను. ముకారము విభక్తి ప్రత్యయమైనను, సాధారణ ముకారమైనను యతి మైత్రి చెల్లుటయందు భేదమేమియును లేదు. ఒక్క ముకారయతి చెప్పిన, అందే మువిభక్తియతియు నంతర్గత మగును. కావున రెండు యతులుగ విభజించుట వ్యర్థమగుటచే మువిభక్తియతి చెప్పుట యనావశ్యకము.

అభేదవిరతి యందు వ, బలకు మైత్రి చెప్పబడి; దాని వెను వెంటనే ప, ఫ, బ, భ, వ లమైత్రి అభేదవర్గయతి యని చెప్పబడినది. వ్యంజనయతులలో తొలుదొల్త చెప్పదగిన వర్గజయతి ప్రకారము ప, ఫ, బ, భ, లమైత్రి నిరూపితమైనది. దీని ననుసరించి అభేద యతిలో

వ, బ లకు మైత్రి చెప్పిన, వీనితో పాటు వ, ప, భ, లకు కూడను చెప్పి నట్లే యగుచున్నది. కావున అభేద, అభేదవర్గ యతులను సమీకరించి ఒక్క అభేద విరతిని చెప్పుట యుచితము. కాగా అభేదవర్గయతి యనావశ్యక మగును.

'తరియించు' వంటి రూపములలో స్వరయతి, 'తరించు' వంటి రూపములలో వ్యంజన యతి పాటించుటను 'భిన్నయతి' యనియు; అట్లే 'చేతి యది' వంటి రూపములలో స్వరయతి, 'చేతిది' వంటి రూపములలో వ్యంజనయతి పాటించుటను 'ప్రత్యేకయతి' యనియు అప్పకవి రెండు విధములగు యతులను చెప్పెను. సంధిలేని రూపములలోను, సంధి చేయబడిన రూపములలోను క్రమముగ స్వర, వ్యంజన యతులు చెల్లుటను బట్టి; సంధి కావింపబడిన తరించు, చేతిది వంటిరూపములలో స్వరయతి వారింపనెంచి, భిన్నము చేయబడిన అనగా సంధిలేని రూపములందు మాత్రమే స్వరయతి చెల్లునని చెప్పదలచుటయే ఈ యతుల ప్రయోజనము. మొదటి దానియందు ఇకారమును, రెండవదాని యందు అకారమును పరపదాది స్వరమగుచున్నది. ఇట్టి స్వల్ప భేదము తప్ప రెండు యతులుగ చెప్పుటయందు విశేషము లేకపోవుటచే రెండింటిని కలిపి ఒక్క భిన్నయతియందే చెప్పదగును. ప్రత్యేక యతిని చెప్పుటలో ప్రత్యేకత లేమిచే నిది యనావశ్యక మగుచున్నది. తదుపరి తరించు, చేతిది వంటి రూపములలో కేవల స్వరయతి నిషిద్ధ మని చెప్పుటయే భిన్నయతి యొక్క ప్రయోజన మగుటవలన దీనినొక యతిగా చెప్పనవసరము లేదు. కాగా భిన్నయతిని అగ్రాహ్యయతులలో పరామర్శించుట యుక్తము.

వర్గాక్షరములకు అనునాసికములు పరమగుచో తత్తద్వర్గాంత్యాను నాసికము వైకల్పికముగ నాదేశమగుననెడి వ్యాకరణ విధిచే హృత్ + మర్య = హృద్మర్య, హృన్మర్య అనెడి రూపము లేర్పడు చున్నవి. వైకల్పిక సంధి వలన రెండు రూపము లేర్పడుటచే వీని సంధి గతాక్షరముల యొక్క యతినియతి వికల్పవిరమణమని చెప్పబడినది. అనునాసికేతరములైన వర్గ హల్లులకు హకారము పరమగుచో, దానికావర్గ

హల్లు యొక్క సవర్ణము వైకల్పికముగ నాదేశమగు ననెడి వ్యాకరణ విధిచే వాక్ + హరి = వాగ్ఘరి, వాగ్హరి అనెడి రూపము లేర్పడు చున్నవి. అంల్యోష్మము పరము కాగా వైకల్పికసంధిచే నేర్పడు రూప ద్వయము యొక్క సంధి గతాక్షరములకు పాటింప వలసిన యతి నియతి యంల్యోష్మసంధివడి యని చెప్పబడినది. ఈ రెండు విధములైన సంధులలోను వ్యాకరణ ప్రక్రియ భిన్నమైనను సంధి వైకల్పిక మగుట చేత రెండేసి రూపములేర్పడుట యను సామ్యము కలదు. కావున నీ రెంటిని సమన్వయ పరచి పూర్వ, పర, ఆదేశ వర్ణములు మూడింటి కిని యతి చెల్లింపవచ్చు ననెడి నియమమును ఒకే యతి యందు చెప్ప దగును. రెండు సంధులును వికల్ప సంధులగుటచేత దానిని వికల్ప విరమణమని చెప్పినచో రెండవది యనావశ్యకమగును.

ఇట్టి విరమైన పరిశీలనముచే అప్పకవీయ యతులను ఈ దిగువ రీతిని వింగడించి చూపనగును.

## మైత్రిసూచక యతులు — నియమసూచక యతులు

### స్వర యతులు

| మైత్రిసూచక యతులు | నియమసూచక యతులు |
|---|---|
| 1. స్వరమైత్రివళి | 1. స్వరప్రధానవళి |
| 2. ఋవళి | 2. లుప్తవిసర్గకస్వరవళి |
| 3. ఋత్వ సంబంధవళి | 3. వృద్ధివళి |
| | 4. ఋత్వసామ్యవళి |

### వ్యంజన యతులు

| మైత్రిసూచక యతులు | నియమసూచక యతులు |
|---|---|
| 4. వర్గజయతి | 5. ప్రాణియతి |
| 5. బిందుయతి | 6 సంయుక్తాక్షరయతి |
| 6. సరసయతి | 7. ఏకతరయతి |
| 7. అనునాసికాక్షరయతి | 8. వికల్పయతి |

8. అనుస్వారసంబంధయతి
9. తద్భవవ్యాజయతి
10. విశేషవళి
11. ఋకారయతి
12. ఋవర్ణవిరామము
13. అభేదయతి

9. ఉభయయతి
(ఇవి పంద్రెండు విధములు)
10. భిన్నయతి
(అగ్రాహ్యవళులలో చేర్ప దగినది.)
11. ప్రాసయతి
(ప్రాస భేదములలో చెప్ప దగినది.)

## అనావశ్యకమైన యతులు

14. ఋజుయతి
15. ఊష్మయతి
16. ఋవిభక్తి యతి
17. అభేదవర్గయతి

12. ప్రత్యేకయతి
13. అంత్యోష్మసంధివడి.

## క్రొత్తగా చెప్పవలసిన యతిమైత్రులు

భాష సహజమైన వ్యవహార స్వరూపము కలది. వ్యాకరణము భాషను వ్యాకరించుచున్న దగుటచే, నది ప్రయోగశరణ్యమైనది. కవిత్వము భాషా నిర్మాణమయ్యును, కవియొక్క భావ సౌరమగుటచేత భాష లోని సహజగుణములతో పాటు కల్పనారామణీయకమును కూడ కలిగి యుండును. కావున ఛందశ్శాస్త్రమునందు కావ్యముయొక్క మూల ధర్మములతో బాటు, శాస్త్ర సమ్మతమై కవోద్దీప్తికి దోహదపడు నూత్న సిద్ధాంతములు కూడ నుండును. దీనిచే కవులకు ప్రయోగ సౌలభ్యమును

కవితాకళకు నూతన శోభయు చేకూరును. అనగా ఛందశ్శాస్త్రమునందు పలువిధములైన సూత్రము లున్నయెడలనే కావ్యమును తద్గతమైన రస భావాదులను ప్రకటించునట్లుగ రచించుటకు సాధ్యపడును. కావున ఛందశ్శాస్త్రము కావ్యచ్ఛందమును ప్రకటించుటలోపాటు కావ్యరచనమున కుపకరించు పలువిధములైన లక్షణములను ప్రతిపాదింప సమర్థమునై యుండునని నిర్ణయింపనగును. దీనికి క్రింది విషయ మాలంబనము కాగలదు. పరిమితములైన వృత్తములనే మహాకవులు స్వీకరించి కావ్యములు రచించి యున్నప్పటికిని ఛందశ్శాస్త్ర మసంఖ్యాకమైన వృత్తములకు లక్షణములు చెప్పుచున్నది. వీని నుండి తమతమ కావ్యగత భావముల కనువగు వృత్తముల నెన్నుకొనుటకు కవులకు స్వేచ్ఛకలదు. చెప్పవలసి వచ్చినచో లాక్షణికులు సూచించిన వృత్తములలో ప్రయోగ భాగ్యమందనివియే అత్యధిక సంఖ్యలో కలవు. లక్ష్యావిర్భావము తరువాతనే లక్షణ రచనము జరిగియుండి నప్పటికిని, శాస్త్రపర మైన హేతువులచే లక్షణ వైపుల్య మేర్పడి కవులకు ప్రయోగ సౌలభ్య మధికతర మగును.

ఈలాగుననే యతిమైత్రుల యొక్క లక్షణములందును శాస్త్ర పరిధికి లోనైయుండు క్రొంగ్రొత్త యతులను చెప్పదగును. సందర్భోచిత్యములను బట్టి యతిమైత్రి నిర్వహణమునం దిట్టివిధమైన క్రొత్త యతులను పాటించుటకు కవికి అవకాశము కలుగును. తద్ద్వారా కావ్యరచనమున సహజమును, రసవంతమును, శక్తిమంతమునైన పదప్రయోగము చేయుటకు వీలగుఁజే నది లక్షణగౌరవము కలిగియుండును. దీని వలన కవితా రచనమున యతిమైత్రి నిర్వహణ మొక ప్రతిబంధక మను అవ్యవత తొలగిపోవును.

## ఇ ఈ ఎ ఏ-రి రీ రె రే ల మైత్రి

ఋకారములో ఇఈ ఎఏ లు మైత్రి నొందునని స్వరప్రధానవళియు, రి రీ రె రే లు మైత్రి నొందునని ఋ వళియు చెప్పుచున్నవి. ఈ రెండు

విరములైన మైత్రుల వలన ఇ ఈ ఎ ఏ లకు రి రీ రె రే లతో మైత్రి నంగీకరింప వలని యున్నది. ఈ యతి మైత్రిని లాక్షణికులు చెప్పినట్లు లేదు. కాని, పై మైత్రి నాధారముగా గొని యిట్టిమైత్రి చెల్లించుట సమంజసమగుటచే, దీనిని గుర్తించిన అనంతుడు లక్ష్యములు కానరామి కారణముచే........ఈ, ఏ లకుఁదలఁపగ రీ లోడి విరతి తలకొన రెండున్' అని యీ మైత్రిని ఖండించినాడు. ఈ మైత్రి చెల్లిన ప్రయోగములు పూర్వకావ్యములందు లేకపోవచ్చును గాని, మైత్రిని మాత్ర మంగీకరింప వలసి యున్నది. ఋత్వ విశిష్టమైన ఏ వ్యంజనమునకైనను ఇ కార స్వరవర్గము (ఇ ఈ ఋ ౠ ఎ ఏ) లో మైత్రి ఋత్వ సంబంధవశిచే అంగీకరింపబడి యుండగా న్వయముగ ఋకారమునకు మిత్రములైన రిరీ రెరేలతో ఇకార స్వర వర్గమునకు మైత్రి నేల కూర్పరాదు? ఇట్టి అభి ప్రాయము కలవారగుటవలన అనంతుడు, లక్ష్యములు లేవనెడి తలంపుతో నీ మైత్రి చెల్లక పోవుటకు గల కారణమును

> "తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
> గలుగు రేఫ, యిత్వమునందుఁగదిసి యతికి
> నట్టి రి రి నీ యేంతో నన్వయించు
> నట్టి సత్త్వఁబు లేదదిహల్లిగాన"
>
> -ఛందోదర్పణము (1-89)

అని సమర్థించినాడు. తదుపరి ఋత్వ సంబంధవశి యందే ఇకార స్వరవర్గ విశిష్టమైన య హ లను, వట్టుసుదిలో కూడియున్న ఏ హల్లైనను ఇకార స్వర వర్గములో మైత్రి నొందునని చెప్పబడినది. అనగా ఇ ఈ ఋౠ, ఎఏలు, యియీ య్ృ య్ౄ యెయేలు, హిహీ హృహౄ హెహేలు, కృ గృ ఇత్యాదులు మిత్రములు. ఇందలి యొక మైత్రికి సరసవశిలోని అయహలమైత్రి కారణము. ఈలాగుననే ఋరి ల మైత్రిచే ఇ-రిలకును మైత్రి నంగీకరింపవలని యున్నది.

ఋవశికి అప్పకవి చెప్పిన లక్షణము కొంత స్పష్టత కొరవడి

యుండుటచేత నీ మైత్రిని లాక్షణికులే అంగీకరించి యున్నారని తలంచుట కవకాశ మేర్పడుచున్నది.

"ఇత్త్వైత్వంబులఁ దొలఁగక, ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మిత్రత్వంబు నెఱపు......"నవి అప్పకవీయ లక్షణము (3-22).

ఈ వాక్యముయొక్క భావమును, ఇ ఈ ఎ ఏ లను కూడిన ఋకారము రేఫములో మైత్రి నొందుట ఋవళి యనబడునని సులభముగ చెప్ప వచ్చును. కాని ఇ ఈ ఎ ఏ లతో కూడిన రేఫములో ఋకారమునకు మైత్రి కలదనుట ఋవళి యనబడునని క్లిష్టాన్వయమును లక్షణముగ చెప్పుట ప్రచారము నొందినది. ఇట్లుచెప్పుటకు ఋ-రి లకు మాత్రమే యతి మైత్రి చెల్లిన ప్రయోగములుండుటయు, ఇ ఈ ఎ ఏలకు 'ర'తో మైత్రి చెల్లిన ప్రయోగములు లేకపోవుటయు కారణము. పై లక్షణపద్యమునగల 'తొలఁగక' అను దానికి 'కలయక', 'చెరయక' అను రెండు పాఠాంతరములు కలవు.

ఈ పాఠములకు 'కలసియుండక', 'కూడక' అనునవి అర్థములగుట చేత ఇత్త్వైత్వములలో కూడియుండని ఋకారము రేఫములో మైత్రి నొందునని అన్వయము చెప్పినచో ప్రస్తుత లక్షణమునకీ పాఠములు బాధకములు కావు. దీనినిబట్టి ఋకారస్వరమునకు రేఫ వ్యంజనములో మైత్రి చెల్లునని చెప్పవలసి వచ్చుటచేత, అది యంత శాస్త్రీయముకాదని యభిప్రాయపడుట వలన 'తొలఁగక' అను పాఠమును గ్రహించి ఇత్త్వైత్వములఁ దొలఁగక అనెడి దళమును రేఫమున కన్వయపరచి లక్షణము చెప్పు విధానము వ్యాప్తి నొందినది. కాని ఋకారస్వరమును రేఫలో వడిగూర్చిన ఋత్వ యతి యని లక్షణ శిరోమణి యిట్లు చెప్పుచున్నది :

"గరిమ స్వరరూపమైన ఋకారమునకు
రేఫతోఁగూడి వడి యొనరించిరేని
ఋత్వయతియన నదియొప్పు గృతులయందు
ఋషి మహోంబుధి మత్తద్విరేఫ కృష్ణ"–(4-233)

లక్షణ శిరోమణియందు చూపబడిన చిత్రపు టీమన్న లక్షణమునందుకూడ నిట్లే చూపబడినది.

''అచ్చులలోని ఋకారం
బచ్చుపడన్ రేఫతోడ ననుపైన యెడన్
చెచ్చెర వడిగా నిలుపుట
పొచ్చెము గాదాది కావ్యముల మున్నదికిన్'' (4-234)

కావున ఋకారమునకు రేఫతో మైత్రికలదనినచో ఋకారమునకు మిత్రములైన స్వరములతో కూడిన రేఫమునే గ్రహింపవలెనని పై లక్షణములను బట్టి నిర్ణయమగుచున్నది. ఈలాగున స్వీకరించినచో ఇఈ ఎఏలు లేకుండగ ఋకారమొక్కటియే రిరీరెరే లతో మైత్రి నొందుననెడి లక్షణమునకు "ఇత్వైత్వంబులఁ గలయక (వెరయక) ఋత్వంబును, ఋవళి యనఁగ రేఫములతో.. .."అను వాక్యమును, అప్పకవి చెప్పిన సరియైన పాఠముగా గ్రహింపవలసియున్నది. "ఇత్వైత్వంబులఁ దొలఁగక......" అను పాఠమును స్వీకరించినచో లక్ష్యములనుబట్టి అన్వయమును కల్పింపవలసి యున్నది. లేనిచో ఇత్వైత్వములతో కూడిన ఋకారము (ఇ ఈ ఋ ౠ ఎ ఏ)నకు రేఫములతో మైత్రికలదని అప్పకవియే చెప్పినట్లు భావింపవలసి యున్నది.

ఋకారముయొక్క రేఫతుల్యత్వముచేత 'ఈశ్వరద్రోహి గర్వాంధ ఋషివరేణ్య' (కాశీ ఖండము 7-95) మొదలుగాగల యతిమైత్రులందు ఋకారస్థానమున రేఫమే వినబడుచున్నది. ఋషికి రిసియని రూపాంతరము కలదు. ఇట్టి తావులలో 'ఈ-రి'లకు యతిమైత్రి చెల్లినట్లే యగుచున్నది. ఈ కారణముచే ఋకార మిత్రములైన ఇత్వైత్వములకు రి రీ రె రే లతో మైత్రి నంగీకరించుట సమంజస మగుచున్నది. ఇట్టి మైత్రిచెల్లిన ప్రయోగములు పూర్వ కావ్యములందు కనబడక పోయినప్పటికిని, చెల్లుటయందు సహజత్వముండుటచేత ఆధునిక కావ్యములం దచ్చటచ్చట కనబడు చున్నవి.

మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్ప వృక్షమునందలి లక్ష్యము : క॥"నే వాని కొంపకూల్చితి, నే వీన్ని కులాంగ నన్ హరించితినివియా! ......" (జటాయుఃఖండము-400) (అరణ్య కాండము. పంచమ ముద్రణము). ఇందలి 'హరించితి'అను పదము 'వచించితి'అను పాఠాంతరముతో ద్వితీయ ముద్రణమున కలదు. అర్థౌచిత్యమును బట్టి యర్వాచీన ప్రతిలోని పాఠమును ప్రమాణముగా స్వీకరింపవలసి యుండుటచే, విశ్వనాథవారు ఇ ఈ ఎ ఏ రి రీ రె రే ల యతిమైత్రి నంగీక రించినట్లు తెలియుచున్నది.

ఆచార్య శ్రీ భారతిగారి 'నాగార్జునసాగర్' కావ్యము నందలి లక్ష్యము : ఉ॥ నిర్మింప జలాశయంబు మదినెంచిరి లోకహితార్థ షేర్వడన్. (ప. 20)

## 2. ఋ - లిలీఠలే లమైత్రి

ర, ల లయతిమైత్రి అప్పకవి కంగీకారము కాదు. ఉచ్చారణమునం దీ రెండక్షరములు సామ్యధర్మములను కల్గియుండుటచే నభేదతను కల్గి యున్నవి. 'రలయోరభేదః' అని ప్రమాణము. రోలంబ - లోలంబ, రేఖా-లేఖా అనెడి రూపద్వైవిధ్యమును అప్పకవి సమ్మతించి ర, ల ల యతిమైత్రి మాత్రము చెల్లదనెను. ఈ రూపద్వైవిధ్యమునకు గల హేతువే ర, ల ల యతిమైత్రి చెల్లుటకును హేతువగుచున్నది. ప్రాచీనార్వాచీన కావ్యములందీ యతిమైత్రి విరివిగ పాటింపబడుటచే లింగమగుంట తిమ్మన పొత్తపి వేంకటరమణకవి, రంగకవి, కూచిమంచి వేంకటరాయకవి మొదలగువారు ర, ల లయతిని తమ తమ లక్షణగ్రంథములందు చెప్పి యున్నారు. కావున ర, ల లకు యతిమైత్రి చెల్లునని నిర్ణయము.

ఈ మైత్రి నాధారముగ గొని ఋ, లి లకు యతిమైత్రి చెప్ప నగును. ఋకారముతో రేఫము (రి) నకు మైత్రి చెల్లుట (ఋవళి)వలన, రేఫమునకు మిత్రములైన లకారము (లి) నకును మైత్రి నంగీకరింప వలసియున్నది. అనగా ఋ కారమునకు లిలీ లెలే లతో యతిమైత్రి

కూర్పవచ్చును. ఇట్టి మైత్రి చెల్లిన ప్రయోగములు లేకపోవచ్చును, కానీ మైత్రి చెల్లుట సహజము.

స్వీయ లక్ష్యము:- ఋషివరేణ్యులు జూచెడి లీలలెల్ల.

ఙ, న, ణ లకు యతిమైత్రి చెల్లునని తద్భవవ్యాజ విశ్రామము చెప్పుచున్నది. ఈ అక్షరములలోని అనునాసిక్య ధర్మమే ఈ మైత్రి చెల్లుటకు హేతువు. కావున అనునాసికములైన 'ఞ ణ న' లకు మైత్రి నంగీకరింపవలసి యున్నది. ఇందలి 'ణ న' ల యతిమైత్రి (సరసయతి) ప్రసిద్ధమైనట్టిది. వర్గములోని తొలి నాల్గక్షరములు బిందుపూర్వకములైనచో తత్తద్వర్గానునాసికముతో యతిమైత్రి చెల్లునని బిందుయతి చెప్పుచున్నది. ణ, న లకు చెందిన ట, త వర్గముల పరస్పరమైత్రులు అనుస్వార సంబంధ (ంట, ంఠ, ండ, ంఢ,-ంత, ంథ, ంద, ంధ), అనునాసికాక్షర (ంట, ంఠ, ండ, ంఢ,-న; ంత, ంథ, ంద, ంధ-ణ) యతుల మూలమున నిరూపింపబడినవి. ణ, న లకు ఞ కారములో అనునాసిక్య ధర్మముచే మైత్రి నంగీకరించుటవలన ట, త వర్గములకు చెందిన పరస్పర మైత్రులందు ఞ కారమునకు చెందిన చవర్గమునకును మైత్రి చెప్పవలసి యున్నది. దీనినిబట్టి ఈ దిగువ మైత్రులను చెప్పదగును.

## 3. ంచ, ంఛ, ంజ, ంఝ, - ణ, న లమైత్రి:-

చ వర్గములోని తొలినాల్గక్షరములు బిందుపూర్వకములైనచో ణ,న లతో మైత్రి చెల్లును. దీనిని అనునాసికాక్షర యతియందు చెప్పదగును. ఈ యతి మైత్రి చెల్లిన లక్ష్యములు పూర్వకావ్యములందు మృగ్యములు. అర్వాచీన కావ్యమగు సౌందరనందము నందిట్టి మైత్రి చెల్లిన ప్రయోగమొకటి కనబడుచున్నది.

నీదు నెమ్మోముగాంచెడి యదృష్టముగోలు
పోలేక కన్గవమూయ వెఱచి

(నిరీక్షణము-38)

## 4. ంట,ంఠ,ండ,ంఢ,ంత,ంథ,ంద,ంధ – ఞ, జ్ఞలమైత్రి

ట, త వర్గముల తొలి నాల్గేసి యక్షరములు బిందుపూర్వకము లైనచో 'ఞ,జ్ఞ' లతో మైత్రి చెల్లును. దీనినికూడ అనునాసికాక్షర యతియందు చెప్పదగును. ఇందలి బిందుపూర్వక త వర్గునకు జ్ఞా తో మైత్రి చెల్లునని లక్షణ శిరోమణి (4-114) యందు చెప్పబడినది. దీనికి ప్రయోగ బాహుళ్యము లేకపోవుటచే శిరోమణికారుడు దీనినొక విశేషమని చెప్పి వరాహపురాణమునుండి యీ దిగువ పద్యము నుదాహరించి యందలి 'ంద-జ్ఞ' లకు యతిమైత్రి చెల్లుటను ప్రదర్శించినాడు.

మ॥ అని గౌరీపతికిన్ భవానికివి నాహ్లాదంబుగాఁబల్కి-వే
చని లోకైక పితామహున్నలువ నాస్థానంబులో నుండఁగాఁ
గని దేవాళశిఖండ మౌళికి సుమఃగల్యాణి నాఙార్మినం
దన వీవాత్మఁదలంచి దేవరకు విజ్ఞాపింప నేతెంచితిన్."

–లక్షణశిరోమణి (4-115)

ముద్రిత వరాహపురాణమునందీ పద్యము కానరాకపోవుటకు, అప్పకవీయ యతులచే నందలి 'ంద-జ్ఞ' లకు చెల్లిన యతిమైత్రి సమర్థింపబడక పోవుటయు నొక కారణమై యుండవచ్చును.

## 5. ంచ, ంఛ, ంజ, ంఝ – ంట, ంఠ, ండ, ంఢ, – ంత, ంథ, ంద, ంధ ల మైత్రి:–

అనునాసికములు బాసిన చ, ట, త వర్గాక్షరములు బిందుపూర్వకము లైనచో పరస్పరము యతిమైత్రి చెల్లును. దీనిని అనుస్వార సంబంధ యతియందు చెప్పదగును. ఇట్టి మైత్రి చెల్లిన ప్రయోగములు పూర్వ కావ్యములందు మృగ్యములు. అర్వాచీన కావ్యమగు సౌందరనందము నందు 'ంచ-ండ' లకు యతిమైత్రి చెల్లిన ప్రయోగమెకటి కనబడు చున్నది.

కా॥ శం,త్రి॥ నాకన్నను నీకటం చనునయింంచెన్ శేర్మి ద్రైవారంగన్.
(ఉపదేశము-34)

ఈ మూడు విధములగు మైత్రులవలన అప్పకవీయమున చెప్పబడిన ట, త వర్గముల మైత్రులతోపాటు చవర్గమునకును మైత్రి యధికముగ చెప్పినట్లగుచున్నది. అందలి సరసయతి యందు 'ణ,న'లతోపాటు 'ఞ' కారమును; అనునాసికాక్షర అనుస్వార సంబంధ యతులందు ట,త వర్గములతోపాటు చవర్గమును జోడించి చెప్పినయెడల లక్షణము యొక్క ప్రయోజన పరిధి యధికమగుటతోపాటు లక్షణ రచనమునకు సంక్షేపము కూడ సిద్ధించును.

-:O:-

# శబ్దాలంకారప్రాసలు - ప్రారంభదశ

తెలుగు ఛందశ్శాస్త్రమునందు చెప్పబడిన సుకరప్రాస, దుష్కరప్రాస, ద్విప్రాస, త్రిప్రాస, చతుఃప్రాస, అంత్యప్రాస, అనుప్రాస అను వానిని శబ్దాలంకారప్రాసలని లాక్షణికులు నుడివియున్నారు. పద్యరచనము నకుమాత్రమే సంబంధించినవి యగుటచేతను, ఐచ్ఛిక ప్రయోగముకలవి యగుటచేతను, ఇవి ఛందస్సంబంధమైన శబ్దాలంకారము లగుచున్నవి. ఛందమునకు నియతమైన ద్వితీయాక్షర ప్రాసయొక్క లక్షణమునుండి ఇవి వ్యుత్పన్నమైనట్లు చెప్పవచ్చును. కావుననే వీనికి సుకరప్రాస ఇత్యాదిగా నామేములేర్పడి, శబ్దాలంకారప్రాసములను వర్గనామము కలిగినది.

ప్రాస ప్రయోగము యతితోపాటు తెలుగు కవిత్వమునకు సహజ లక్షణమగుటవలన, శబ్దాలంకారప్రాసలుకూడను తెలుగు ఛందమునకు సహజాలంకారము లగుచున్నవి. కావున వీని ప్రయోగము దేశిచ్ఛందోజాత పద్యములందే యధికముగనుండుట కవకాశము కలదు. ఇవి కందమునందు విరివిగను, సీసగీతములం దల్పముగను కలవు. వీనికి వృత్తములందుకూడ అచ్చటచ్చట ప్రయోగము కలదు. సంస్కృతమున ఛందస్సంబంధమైన ప్రాసలేకపోవుట వలన, తెలుగు ఛందశ్శాస్త్రమునందున్నట్టి శబ్దాలంకార ప్రాసములందుండుట కవకాశములేదు. ఈ కారణముచే తెలుగు వృత్త పద్యములందు ప్రాసనియతి పాటింపబడినప్పటికిని, శబ్దాలంకారప్రాసలు విశేషముగ ప్రయోగింపబడలేదు.

వీని లక్ష్యలక్షణములను భీమన, పెద్దన, అనంతుడు కందములో రచించిరి. అప్పకవి ఒక సీసము, ఒక తేటగీతిలో లక్షణములను రచించి లక్ష్యములను కందములో రచించెను. లక్ష్యలక్షణములను చిత్రకవి పెద్దన సీసమున ప్రదర్శించినాడు. వీటిని కందమునందు చెప్పిన రమణకవి, లాట, ఛేక, వృత్యనుప్రాసల లక్ష్యములను వృత్తములలో రచించెను. తాతంభట్టు, రంగకవికూడ కందములోనే రచించిరి. దీనినిబట్టి శబ్దాలంకార ప్రాసల

ప్రయోగ రామణీయకమునకు కందములే అందమైనవని తెలియుచున్నది.

శబ్దాలంకార ప్రయోగాధిక్యమైన కావ్యమధమమని అలంకారికుల యభిప్రాయము. వీని ప్రయోగముపైగల మక్కువ రసభావవ్యక్తీకరణము నకు దోహదము చేయకపోగా అవరోధమని వారల నిర్ణయము. ఈ కార ణముచే కావ్యమున రసపోషణకు, భావౌన్నత్యమునకు, వ్యంగ్యవైభవము నకు నిచ్చిన ప్రాధాన్యము శబ్దప్రయోగమున కీయబడదు. కావున శబ్దాలంకార ప్రయోగమరుదుగ ప్రత్యేక సన్నివేశమును పురస్కరించుకొని చేయబడు నని తెలియదగును. తెలుగు కావ్యములందు ప్రబంధయుగము వీని ప్రయో గమునకు స్వర్ణయుగము. తరువాత దక్షిణాంధ్రయుగమునం దివి లేని కావ్యము రమారమి లేకపోయినవ్వటికిని, వీనివలన కావ్యమునకు వన్నె చేకూరలేకపోయినది. విజయవిలాసమువంటి ఒకటి రెండు కావ్యము లీ విలక్షణ నరిగమించి వెలసినవి. వీని అధిక్యముచే కావ్యముయొక్క రస భావాదులు తక్కించబడుటవలన, దక్షిణాంధ్రయుగమునకు సాహిత్య చరి త్రమునందు క్షీణయుగమని పేరేర్పడినది. శబ్దాలంకార ప్రాసలుకూడ శబ్దాలంకారముల పరిధిలోనికి వచ్చుటవలన, వానిచరిత్రము శబ్దాలంకారముల చరిత్రమునం దంతర్భాగ మగుచున్నది. పురాణయుగమునం దంకురరూప మునన్న శబ్దాలంకారప్రాసలు (దీనికి కుమారసంభవ మపవాదము) ప్రబంధయుగమునందు విస్తృతినొంది ప్రాశస్త్యమును బడసినవి. తరువాత దక్షిణాంధ్రయుగమునం దతిగా వ్యాపించినవని చెప్పవచ్చును.

అక్షరరమ్యత నాదరించి నాదాత్మకమైన యానందమును అక్షర రూపమున నావిష్కరించిన మహాకవి నన్నయ భట్టారకుడు. రమ్యాక్షర సంయోజనమువలన నీతని కావ్యము శ్రోత్రానంద సందాయి యగుచున్నది. ఈ కారణముచే నన్నయ కవిత్వమున విశిష్టమైన శబ్దాలంకార భాసురత సహజముగనుండి శబ్దాలంకారప్రాసల ఛాయలోనున్న రచనలు కనబడును. అరణ్యపర్వమునందలి "వరదు సురాసురవందితుఁ, కరుణాకరు హరుఁ బినాకకరుఁ గరి చర్మాం, బరు శంకరు.గిరిజాసుం, దరు నిట్లని సంస్తు తించెఁ దద్దయు భక్తిన్." (1-323) అను పద్యమునందు ప్రాసాక్షరమైన రకారము పునః పునః ప్రయోగింపబడినది. ప్రాసాక్షరము ప్రాసధర్మముతో

పలుమార్లు అవృత్తియగుట అనుప్రాసము. ఇట్టి అనుప్రాస మల్పతరముగ నన్నయ రచనమున గోచరించును.

క. "దళి మణిమయకరువిట
లాట జ హూత దత్యదతిఃతానంగు విరూ
పాత మహోత ధ్వజుఁడ్రి
త్యతము గావించె నుగ్రఁతపమునఁ దేర్మిన."
- అరణ్య పర్వము (3-49)

అను పద్యమునం దనుప్రాసముండియు, ఒక్క పాదమునకు లోపించిన ద్వ్యక్షరప్రాసము యొక్క ప్రాథమికావస్థ కనబడుచున్నది. ఇట్లే "బాలుండవు నియమవ్రత, శీలుండవు......" (ఆది పర్వము. 3-106) అను పద్యమునందు రెండు పాదములకు పరిమితమైన త్ర్యక్షరప్రాసము వెలయుచున్నది. నన్నయ కవిత్వమునం దీరీతిని శబ్దాలంకారప్రాసలు ప్రాథమిక స్వరూపము నందున్నట్లు గుర్తింపనగును.

"అంగజరాజ్యలక్ష్మి పొదఁవైనది యొక్కొ యనంగ నొప్పు చి
త్రాంగదయందు బార్థుఁడు మహాప్రణయప్రవణాంతరంగుఁడై
యంగజ భోగసంగమున నమ్మణిపూరు పురిన్ సమస్త లో
కాంగనరంరసంగత విహారయశోంగదుఁడుండె లీలతోన్"
ఆది పర్వము (8-148)

అని రచించిన ఉత్పలమాలలో అనుప్రాసను బోలిన యక్షరసంయోజనము కనబడుచున్నది. ప్రచురింపబడి కూర్పబడినట్టి శబ్దాలంకార ప్రాసలలోని అనుప్రాసయని దీనిని చెప్పుట యంత సమంజసముకాదు. ఎలన నంన్కృత వృత్తములందు శబ్దాలంకారప్రాసలు లేకపోవుటవలనను నన్నయ కాలము నాటి కివి కందములందు ప్రాథమికావస్థలో నుండుటవలనను వీని ప్రభావము వృత్తములపై బడెనని చెప్పజాలము. మధురాక్షర స్వీకారముచే కావ్యమును శ్రావ్యతరము గావింప సమకట్టిన వాడగుటవలన నన్నయ పై ఉత్పలమాల

యంగు అనుప్రాసస్ఫూర్తి కలిగించు రచనము చేసినారని భావింపనగును. అనుప్రాసను బోలినట్టి వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారము వెలయుచుండుట వలన నిచ్చట అక్షర చమత్కృతిని సాధించుటకు ప్రాసాక్షరమును గైకొనుట యాదృచ్ఛికమని చెప్పనగును. ఈ విధముగ నన్నయ రచనమున గోచరమగు శబ్దాలంకార ప్రాసలు వాని ప్రాథమిక దశను తెలుపుచున్నవి.

శబ్ద చమత్కారముకంటె అర్థౌచిత్యమునకు విశిష్టస్థానము కల్పించిన వారు తిక్కనసోమయాజి. అయినను తిక్కన సుస్పష్టము, సంపూర్ణమునైన శబ్దాలంకారప్రాసలను కూర్చినాడు. నిర్వచనోత్తర రామాయణమున "ఉభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడం గళావిదుఁడ" ననియు, "దౌర్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్ శ్రుత్యనురూపమంచు నిడ" ననియు చెప్పుకొని యుండుటను బట్టి ఈతని కావ్యములందు ప్రయోగింపబడిన శబ్దాలంకారప్రాసలు రసోదంచితము లనియే తెలియుచున్నది.

ఉత్తర రామాయణమున (1-17)

క. ఈ కృతికిఁ దొడవుగా నమ
రాకృతి యగు మనుమ నరవరాగ్రేసరుస
త్యాకృతి వంశము గాఁడ
స్వీకృతి దగఁ గీర్తనంబు సేయుదు నెలమిన్.

అను పద్యమున ద్వ్యక్షరప్రాసము కనబడుచున్నది. ఇట్టి శబ్దాలంకార ప్రాసము పాటింపబడిన పద్యము లీ కావ్యమునం దింకను రెండు, మూడు (2-101, 6-54, 8-137) కలవు. తిక్కన "భారతామృతము గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయునట్లుగ" విరాటపర్వమాదిగాగల భారతభాగమును రచించినాడు. సంగ్రహముగ విరాటపర్వమును పరిశీలించిన యందలి శబ్దాలంకార ప్రాసల తీరుతెన్నులే తదపు పర్వములందు నుండిన ట్లూహింపనగును.

విరాటపర్వమున (1-32)

క. ఓంకారవాచ్యునకు నన
హంకార విరూఢభావ •నారాధ్యునకున్.
హ్రీంకారమయ మనోజ్ఞా
లంకారోల్లాస విశ్వ•లాలిత్యునకున్.

అను పద్యమునందలి ద్విప్రాసము సహజాలంకారముగ నొప్పుచున్నది. ఇట్టి ద్విప్రాసాలంకృతమైన పద్యము లచ్చటచ్చట (1-38, 39, 88 ; 2-161 ; 3-92 ; 4-42 ; 5-128) కలవు. ప్రాసము వ్యంజన ప్రధానమగుటచే ద్విత్ర్యాదిప్రాసలలో కూడ వ్యంజనసామ్యమే ఆవశ్యకముగాని స్వర సామ్యము కాదు. స్వరసామ్యమున్నను అదియాదృచ్ఛికమేగాని నియత లక్షణముకాదు. ఈ విషయము "తరణియు-త్తరుణిం-స్ఫురణా-కరుణా" (విరాట. 2-110) అనెడి లక్ష్యము వలన తెలియగలదు. విరాట పర్వము నందలి "అంతం గుంతినందన, కాంతావింతా మహాంధకారములో..." (3-35);

క. ఇరుమలఁ బదుమూఁడేండ్లుం
బదికదుఁ గోపించిచచ్చె •బలువిడిసీక
వ్రదిదశియ మతికి వదివి
వ్వధ యుమ్మటు ప్రోవునెల్లఁ •బొరిగొనెదుబలే (4-233)

అనెడి పద్యములలో అనుప్రాసము కలదని చెప్పవచ్చును. ఈ పర్వారంభ మున "వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణ.."(1-4)అను పద్యమున రెండు పాదములకు మాత్రము చెల్లిన చతుష్ప్రాసము కలదు. ద్వ్యక్షరప్రాసాదులకు కందమునందే యధిక ప్రయోగముకలగు. వీని ప్రభా వముచే నట్టి యక్షరాలంకృతిని తిక్కన వృత్తపద్యమునందు కూడ భాసింప జేసినారు. నిర్వచనోత్తర రామాయణమునందు "కాయిక - దాయకు - ధాయకు-దాయకు" (2-101), "పుణ్యుఁడు - పణ్యుడు - రణ్యుఁడు- రుణ్యుఁడు" (8-137) అనియు; విరాటపర్వమునందు "శిక్షిత - దక్షిత - ప్రోక్షిత-వృక్షిత"(5-57) అనియు ఉత్పలమాలా వృత్తమునందు ద్వ్యక్షర

ప్రాసను కూర్చినాడు. దేశిచ్ఛందము నందలి శబ్దాలంకార ప్రాసల యొక్క శాబ్దికమైన మాధుర్యమును తిక్కన వృత్తమునందు కూడ సాధించినాడు.

నన్నయ కవిత్వమున శబ్దాలంకార ప్రాస సదృశమైన రచనము కనబడుచుండ, తిక్కన కవిత్వమున శబ్దాలంకార ప్రాసలకొక నిర్దుష్టమైన యాకృతి ఏర్పడినది. ప్రారంభదశలో అల్పపరిమాణమున ప్రయోగింపబడిన ఈ శబ్దాలంకార ప్రాసలలో ద్వ్యక్షర ప్రాసమున కధికముగను, అనుప్రాసమున కచ్చటచ్చటను లక్ష్యములు గాంచనగును. ఇవి రమణీయ పద సంవిధానమునం దప్రయత్నముగ కూర్పబడినవేగాని ప్రయత్నించి రచింపబడినట్టివి కావని తలంపనగును.

నన్నయ తిక్కనల నడిమికాలమువాడైన నన్నెచోడుడు తెలుగున శబ్దాలంకార బంధురమైన కావ్యరచనకు నాంది పల్కినాడు. కుమార సంభవము నందనేక విధములైన శబ్ద చమత్కారములతోపాటు గర్భ బంధ చిత్ర కవితలను కూర్చినాడు. వీనితోపాటు శబ్దాలంకార ప్రాసలకు కూడ సముచితమైన స్థానముకలదు. ఈ కావ్యమునందు ప్రబంధ లక్షణము లవతరించుటతోపాటు శబ్దాలంకారప్రాసలు విస్తారముగ ప్రయోగింప బడినవి. ఇందు ద్వి, త్రి ప్రాసలేకాక కొన్ని పాదములకు పరిమితమైన పంచ షట్ప్రాసలు కూడ పాటింపబడినవి. ద్విప్రాసాదులు రెండేసి పాదములకు విడివిడిగా కూర్చుటయు కలదు. పాదాద్యక్షరమును కూడ ప్రాసవలెనే ప్రయోగించుటయు కలదు. ఇట్టివన్నియు సాధారణముగ యమకాలంకారము క్రిందికి వచ్చును. కాని ప్రాసలక్షణమునకు తగినవి కావు. అయినను పద్యరచనలోని అలంకారిక విశేషములగుటచే శబ్దాలంకార ప్రాసలందు ప్రత్యేకముగ పరామర్శింపబడుచున్నవి. వీని ప్రయోగము కందమునందేకాక వృత్తములందును నిరాఘాటముగా సాగినది. ఇట్టివనేక విధములైన శబ్దాలంకార ప్రాస ప్రయోగ విశేషముల కీకావ్యము కాణాచి.

శబ్దాలంకార ప్రాసలకు సంపూర్ణమును, నిర్దుష్టమునైన లక్ష్యము లధికసంఖ్యలో కుమారసంభవమున గాంచనగును. షష్ఠ్యంతములు సాధారణముగ కందములలో రచింపబడును. వీనియందలి సుకర ప్రాసలను వేరుగ పేర్కొన నవసరములేదు. "సద్గురు-జ,గద్గురు-వి,ద్వద్గురు మద్గురు;" వంటివానితోపాటు 'క్ష', 'త్స్వ' మొదలగు ప్రాసాక్షరములతో కూడిన దుష్కరప్రాసలు కలవు (1-60, 62, 64). ఇట్టి దుష్కర ప్రాసలు 'ంధ్ర' (2-54ష్ట, ష్ఠ, ష్క, ష్ణ (6-60, 61, 62, 63) మొదలైన పెనేకములు కనబడుచున్నవి. 'సద్గురు' (1-60); 'ధీమణి-ర,ఘామణి చిం,తామణి-చూ,డామణి (3-112) వంటి ద్విప్రాసలు కలవు. ఇట్టివింకను 'దూషిత-భూషిత-ద్వేషిత-న్వేషిత' (6-59;) 'ఈతండు - డాతండు-డీతండు-డాతండు'; 'అంతకు-నంతకు-మంతకు-టాంతకు' (11-88,89) మొదలుగాగల పద్యములలో గలవు. ఉదాహరణకిటువంటివి ఏకాదశాశ్వాసమునంగు 118, 120, 128, 129 వ సంఖ్యలను; ద్వాదశాశ్వాసమునందు 9, 30వ సంఖ్యలను గల పద్యములు. 'అడిచిరి-పొడిచిరి-విడిచిరి - మడిసిరి' (11-119) అనుదానియందు త్రిప్రాసను చెప్పవచ్చును. చివరిపాదము నందలి సకారము దీని లక్షణమునం దొక విశేషము. ద్వి, త్రి, చతుష్ప్రాసలు రెండు లేక మూడు పాదములకు గాని, లేక రెండేసి పాదములకుగాని పరిమితమైన కందములు కలవు. వీనియందెక్కువ పద్యములలో పాదప్రథమాక్షరము కూడ నాలుగు పాదములందును సమానముగ నుండుట ఈ కావ్యమునందొక విశేషము. 'పుష్కర' (1-94) శబ్దము నాలుగు పాదములందు నాదిని ప్రయోగింప బడుటవలన ఆకందమునందు ద్విప్రాసతోపాటు ఆద్యక్షరమునకు కూడ నట్టి నియమము చెల్లింపబడి నట్లగుచున్నది. 'బంధుఁడ'(2-94) ను శబ్దము నాలుగు పాదములకు నాదినియుంచి రచింపబడిన కందము నిట్టిదే యగుచున్నది, కాని దీని నాల్గవ పాదమున 'బంధుండ' అని పూర్ణబిందువుతో నుండుట వలన ద్విప్రాసలో పూర్ణార్థ బిందుప్రాసము ప్రయోగింపబడినదని ప్రత్యేకించి చెప్పవలసియున్నది. ద్వి, త్రి ప్రాసలందు ప్రథమాక్షరము కూడ సమానముగనున్న కందము లింకను 'శ్రీశ్రిత' (7-1), 'జంగమ' (8-28), 'గోపతి' (11-90) యను పదములతో నున్నవి కలవు.

కొన్ని పద్యములందు రెండేసి మూడేసి ప్రాసల లక్షణములు, దానితోపాటు అద్యక్షర ప్రాసము కూడ కలదు. 'గోపాలక-గోపాలకులా-గోపాలకులె-గోపాలకులై' (4-21) అని యుండిన పద్యమున అద్యక్షర ప్రాసమే కాక పూర్తి పద్యమున త్రిప్రాసమును, చివరి మూడుపాదములకు మాత్రమే గల చతుష్ప్రాసమును కనబడుచున్నది. 'పురిపిదులు - దర మగు - కరములొ-కరములు' (7-114) అని యుండిన కందమున పూర్తి పద్యమున సుకర ప్రాసముకాగా; 2, 3, 4 పాదములకు ద్విప్రాసము; 3,4 పాదములకు త్రిప్రాసము కలదు.

క. నరసిజ రాగావహమై
నరసిజ రాగాత్మక ప్రంచర శోభితమై
యరుణద్యుతి భాసురమై
యరుణద్యుతి భాతిఁ బ్రకటం మై భువిఁబర్వెన్. (8-193)

అనెడి పద్యమున రెండేసి పాదములకు అద్యక్షర ప్రాసములో కూడిన ప్రత్యేకమైన పంచప్రాస కలదు. ఇట్టిదే మరియొక పద్యము:

క. ముక్తాముక్తా యుధములు
ముక్తాముక్తాయుధౌఘంములఁ దగు సుభటుల్
ముక్తాముక్తానులఁ బర
ముక్తాముక్తానుబంధంములు నగుచు నవిన్. (11-130)

దీనియందు పూర్తి పద్యమునకు అద్యక్షరప్రాసముతోపాటు, త్రిప్రాసము కలదు. తరువాత క్రమమున రెండేసి పాదములకు విడివిడిగా రెండు చతుష్ప్రాసలు కలవు.

క. తారకవిరచిత కృతియుం
దారకవిరచిత సుకృతి యుం దా నదఁగు సదా

తారకవిబుధాళికి నువి
తారకవిబుధాధినాథుఁ షణ్ముఖుఁ గనినన్ (10-153)

ఈ పద్యమున మొదటి రెండు పాదములకు షట్ప్రాసయు, కడమ రెండు పాదములకు పంచప్రాసయు కూర్పబడినది. పూర్తి పద్యము మాత్రము త్రిప్రాసము కలది యగుచున్నది. ఇట్టివింకను

క. ముక్తి బంధములగు యా
[illegible]క్తిక బంధములవలన మొగిఁ గ్రమ్మ మహా
రక్తార్ద్రాంబర తలమున
రక్తార్ద్రాంబరతనుఁడు రణరతుఁడాయెన్. (11-181)

మొదలైన పద్యములు కలవు. ఇదే రీతులలో గల ప్రాస వైచిత్రులింకను కొన్ని (10-178), (12-25) పద్యములలో కలవు.

క. ఈనవియ తలఁచుఁ జాగియు
పీనవియ తలఁచు లోభి యొప్పరు సవికిం
జానవియ తలఁచు పిసుఁడుఁ
జానవియ తలంచుఁ బొంద నెరి యెట్లగునో," (11-48)

ఈ పద్యమున షట్ప్రాసము పాటింపబడి; మొదటి, మూడవ పాదములందు అర్ధబిందువు; రెండవ, నాల్గవ పాదములందు పూర్ణబిందువునుండుట వలన పూర్ణార్ధబిందుమైత్రి చెల్లినది.

క. స్థిరమతి శరసిత మూర్తి
వరసుర నరదనుజ దురిత వనధినుకీర్తి
హరదతి శరయుత మూర్తి
స్మరపురహరతనుని దురిత జవననుకీర్తి (10-85)

ఇది 2వ, 4వ పాదములం దనుప్రాసలోను, నాల్గుపాదములందు గుర్వక్షర పూర్వకమైన అంత్యప్రాసలోను ఒప్పుచున్నది. అంత్యప్రాస యొక్క పూర్వాక్షరము 1, 3 పాదములకు; 2, 4 పాదములకు సామ్యము కలిగి యుండుటయు, అంత్యప్రాసాక్షరములు తప్ప, కడమ పద్యమంతయు సర్వ లఘువగుటయు నిందలి విశేషము. ఇట్లే

క. తగుఁదగఁడని మనమున మును
వగవఁగ నాఁగఁబడఁగ వగవ వగవఁగఁబడయున్
దగుఁ దగఁడని వగ వవి వగ
వగవఁగఁ బవిగలదె తనకు వగ మఱి జగతిన్. (10-187)

అను పద్యము సర్వలఘువగుటయేకాక 'అనుప్రాసము'నకు సంపూర్ణమైన లక్ష్యమగుచున్నది. 1-3 పాదములకు, 2-4 పాదములకు ప్రాససంబంధమైన సామ్యము కలిగియుండుట దీనియందొక విశేషము. ఇట్టి అనుప్రాసము 12-39, 211 మొదలైన పద్యములందు చెప్పవచ్చును. శబ్దాలంకార ప్రాసలు కందములందేకాక అటనట వృత్తపద్యములందుకూడ సంపూర్ణముగ ప్రయోగింపబడినవి. ఉత్పలమాలయందు 'అడుచు-ము, డ్డాడుచు-నోలాడుచు-మ,ల్లాడుచు' (9-102)అని ద్విప్రాసము పాటింపబడినది. ఇట్టిదే మరియొక ఉత్పలమాల "వాడిన - గాడిన - పీడిన-మాడిన" (11-57). "వెక్కుడి రూపులన్-నిక్కుడి రూపులన్-గ్రక్కుడి రూపులం-స్రుక్కుడి రూపులం" (11-132) అను పద్యమున పంచప్రాస ప్రయోగముకలదు. ప్రత్యేకప్రాసలేకాక రెండేసి ప్రాసలు కలిపి ప్రయోగింపబడిన వృత్తములును కలవు. ఉ॥ "తన్నినఁజూచె-గ్రన్ననఁ జూచె-మన్నసదప్పి-గన్నుం సన్న" (9-122) అని పాదారంభములుగల పద్యమునందు మూడు పాదములకు ద్విప్రాసము, మొదటిరెండు పాదములకు చతుష్ప్రాసము కలదు. ఇట్లే 11-131, 133 వ సంఖ్యలుగల వృత్తపద్యములందు శబ్దాలంకార ప్రాసలు లేకున్నను శబ్ద చిత్రణముచే తత్సౌందర్యము ప్రకటితమగుచున్నది. ఇట్టి పద్యము లీకావ్యమునం దసంఖ్యాకముగ కలవు.

తే. కాలుఁడాదిగ దేవసంఘంబునెల్లఁ
గాలు కొనకుండ నెగుచు విక్రమదమందు
గాలవశమున నిజబాహుగర్వ మడిగి,
కాలగోచరుఁడయ్యె నక్కాలనేమి. (12-99)

ఉపజాతి పద్యములకు ప్రాసయతి చెల్లునుగాని వానికి ప్రాసనియతి లేదు. పై తేటగీతిలోనున్న ప్రాసప్రయోగ మొకవిశేషము. అనేక పద్యములలో గల ద్విత్రిప్రాసాదులలో వ్యంజనసామ్యముతోపాటు స్వరసామ్యముకూడ పాటింపబడినది. నిజమునకు ప్రాసమున స్వరసామ్య మావశ్యకముకాదు. కాని నన్నెచోడుడు శబ్దాలంకారప్రాసలలో కొన్నిటియందు విధిగా స్వరసామ్యమునుకూడ చెల్లించినారు. ఇది యీ కావ్యమునందొక ప్రత్యేక లక్షణము. నాల్గు పాదములందును ద్వితీయాక్షరసామ్య మున్నప్పుడే అది ప్రాసమనబడును. అట్లే ద్వి, త్రి మొదలైన శబ్దాలంకార ప్రాసలకుకూడ నాల్గు పాదములందును సామ్యముండవలెను. అప్పుడే అవి ప్రాసలగును. ఆ విధముగాక రెండేసి లేక మూడేసి పాదములకు అక్షరసామ్యము పాటింపబడినచో నవి ప్రాసలు కాజాలవు. వీనిని ప్రాసలక్షణమునకు సన్నిహితముగ నున్నట్టి శబ్దచిత్రణము లనవచ్చును. కుమారసంభవ కావ్యము శబ్దాలంకార విశిష్టమైన కావ్యమగుటవలన దీనియందు శబ్దాలంకారప్రాస సదృశమైన శబ్ద చమత్కారములు విశేషముగ కలవు. ఈ విధముగ శబ్దాలంకారప్రాసల ప్రాథమిక స్వరూపము తెలియుచున్నది.

-:O:-

# శబ్దాలంకారప్రాసలు-లక్షణసమన్వయము

శబ్దాలంకార ప్రాయమైన యతిప్రాసలు ఛందోముఖమున కవిత్వము నకు నియత లక్షణములైనవి. అక్షర మైత్ర్యాత్మకమగుటవలన యతి, శబ్దా శ్రయ మగుచున్నది. ప్రాసము అనుప్రాసమను శబ్దాలంకారములో ప్రత్యక్ష సామ్యమును కలిగియున్నది. వీనికి శబ్దార్థములతో ప్రమేయములేదు. ఆ విధ ముగ నివి శబ్దాలంకారములయ్యు, పద్యరచనమున కవశ్య లక్షణములగుటచే ఛందోవేత్తలు వీనిని శబ్దాలంకారముగా పేర్కొనలేదు.

పద్యపాదము యొక్క ద్వితీయాక్షరము నాల్గు పాదములందును సమాన ముగ నుండుటయే ప్రాసమని సాధారణ నిర్వచనము. రెండవ అక్షర ములోపాటు మూడవ, నాల్గవ అక్షరములు కూడ నాల్గు పాదములందును సమానముగ నుండుట, ప్రాసాక్షరమే పలుమార్లు ఆవృత్తియగుట అనునవి కూడ కలవు. ఇవియన్నియు ప్రాసముయొక్క భిన్నరూపములయ్యు పద్య రచనమునకు నియతముకాక ఐచ్ఛికములగుటచే శబ్దాలంకారములై శబ్దాలం కారప్రాసము లనబడుచున్నవి. కాగా వీనిని ఛందోఽలంకారములనుట సముచితము. భిన్నరీతులలోగల అక్షరావృత్తియే శబ్దాలంకార విశేషము. అది ఛందశ్శాస్త్రమున ప్రాసమనియు, అలంకారశాస్త్రమున అనుప్రాస మనియు సూచింపబడుచున్నది.

సాధారణముగ ఆలంకారికులు చెప్పిన అనుప్రాస, యమకాది శబ్దాలంకారములు పద్యగద్యములు రెండింటియందును ప్రయోగింప దగినట్టివి. కాని శబ్దాలంకారప్రాసలు పద్యములందు మాత్రమే ప్రయో గింప దగియుండుటచే నివి యతిప్రాసలతోపాటు ఛందశ్శాస్త్రమునందు మాత్రమే చెప్పబడును, కాని అలంకార శాస్త్రమునందు చెప్పబడవు. దీనిని బట్టి పద్యములందు అలంకారశాస్త్ర కథితములైన వేఱైన శబ్దాలంకార

ములు కూడ కలవని తెలియుచున్నది. వీనిని ఛందోలాక్షణికు లెల్లరును శబ్దాలంకార ప్రాసలనియే పేర్కొనిరి.

శబ్దాలంకార ప్రాసలను భీమన, పెద్దన, అనంతుడు, కాళంభట్టు చిత్రకవి పెద్దన, తిమ్మకవి - 6; అప్పకవి, రంగకవి-7; రమణకవి-8 చెప్పిరి. కూచిమంచి తిమ్మకవి, వేంకటరాయ కవులు వీని నసలు చెప్ప లేదు. కవిజనాశ్రయ కావ్యాలంకార చూడామణులందు షడ్విధములైన శబ్దాలంకార ప్రాసలతోపాటు ద్వితీయాక్షర ప్రాస విశేషములగు ఒ-కర; ఋక్రాంత వర్గప్రాసములు మాత్రము కలవు. ఇవి చూడామణి యందు మాత్రమే చెప్పబడినట్లును, కవిజనాశ్రయమున ప్రక్షిప్తమైనట్లును పరిశోధకుల యభిప్రాయము.[1] ఈవిషయమెట్లున్నను కవిజనాశ్రయ చూడామణులందు యతిభేదముల తరువాత ఐచ్ఛికములైన శబ్దాలంకార ప్రాసలు మాత్రమే ప్రధానముగ చెప్పబడినట్లు తెలియుచున్నది. ప్రాస లలంకార సదృశములగుటవలన ద్వితీయాక్షరప్రాసలు, శబ్దాలంకార ప్రాసలు అనెడి వింగడింపు ప్రాచీనకాలమున లేకపోయి యుండవచ్చును.

కవిజనాశ్రయమున వీనిని చెప్పిన విధవ

క. కానుపమలగుచు సుకర
ప్రాసాఖ్య ప్రాస దుష్కర ప్రాసాంత్య
ప్రాస ద్విప్రాస త్రి
ప్రాసములన షడ్విధములు వరగును గృతులన్. (1-76)

అని ప్రాసలు షడ్విధములుగ చెప్పబడినవి. వీనిలో సుకర, దుష్కర ప్రాసలు రెండుమాత్రమే కవిజనాశ్రయమున చెప్పబడిన "చరణంబు ద్వితీయ వర్ణమిత్తియె ప్రాసంబు" నెడి నిర్వచనమున కనుగుణ మైనట్టివి. కడమవి యా నిర్వచనమున కతీతమైనవగుట వలన ఐచ్ఛికము

1. కవిజనాశ్రయము(పుట-26)

లగు చున్నవి. దీనినిబట్టి ప్రాసభేదములను చెప్పుటయందు నియత నియత భేదము పాటింపబడ లేదని తెలియుచున్నది. ద్వితీయాక్షర ప్రాసకు సుకర, దుష్కరము లనెడి పరిగణనము కూడ ఆలంకారిక దృష్టియే. చూడామణియందు కూడ నిదే విధాన మవలంబింప బడినది. పద్యరచన మునకు నియతమైన ప్రాసభేదములను, వానితోపాటు శబ్దాలంకార ప్రాసలను తొలుదొల్త వింగడించి చెప్పిన వాడనంతుడు. అప్పకవి, చిత్రకవి పెద్దన ఈ విధానము ననుసరించిరి.

భీమన చెప్పిన సుకరప్రాసమును అనంతుడు చెప్పలేదు. భీమన చెప్పని వర్గప్రాసమును అనంతుడు చెప్పెను. అప్పకవి ఈ రెండింటిని చెప్పినాడు. రమణకవి, ఛందోదర్పణము ననుసరించి యివి షడ్విధముల్లని చెప్పుచు, వానితోబాటు కవిజనాశ్రయ లక్షణములను కూడ పేర్కొనినాడు. దానినుండి సుకరప్రాస లక్షణమును కూడ స్వీకరించి అంతర్భిన్నముగ అర్ధబిందు ప్రాసమను దానిని క్రొత్తగా చెప్పినాడు. దీని నితరులు చెప్పలేదు. సులభాక్షరములతో కూడిన ద్విప్రాసముయొక్క ప్రాసాక్షర మధ్యమున అర్ధబిందు వుండుట దీని లక్షణమని లక్షణ శిరోమణిలోని లక్ష్య లక్షణ పద్యమునుబట్టి తెలియుచున్నది.[2] వీనిని చెప్పుటయందు తాతంభట్టు, లింగమగుంట తిమ్మకవి భీమన ననుసరించిరి. చిత్రకవి పెద్దన అనంతుని, రంగకవి అప్పకవిని అనుసరించిరి. భీమన, విన్నకోటపెద్దన, అనంతుడు, తాతంభట్టు, అప్పకవి, చిత్రకవి పెద్దనలు స్వీయలక్ష్య లక్షణములను రచించిరి. లింగమగుంట తిమ్మకవి కవిజనాశ్రయచ్ఛందోదర్పణముల నుండి లక్ష్యలక్షణములను స్వీకరించెను. రమణకవి ఒక్క అర్ధబిందు ప్రాసమునకు స్వీయపద్యమును రచించి, శరమవానికి కవిజనా

---

2. తొలఁకుచు నుండిన తామర
కొలఁకుల కరకరిగి హంసకులమెల్లను నా
కొలఁకుల నాడుచు నున్నను
దలఁకక యన నర్ధబిందుతగు ప్రాసమగున్.

లక్షణశిరోమణి(4-458)

శ్రయ చ్ఛందోదర్పణములనుండి గ్రహించెను. రంగకవి, కావ్యాలంకార చూడామణి నుండి లక్షణములను గ్రహించి స్వీయ లక్ష్యములతో పాటు కొన్నిటికి కవిజనాశ్రయమ్మునుండి, కొన్నిటికి ఛందోదర్పణము నుండి లక్ష్యములను చూపెను. చతుష్ప్రాస కొక్కదానికి ఉత్తమగండ ఛ్ఛందము నుండి లక్షణమును గ్రహించినారు. యతిప్రాసలకు లక్ష్యముగా మహాకవుల ప్రయోగములను చూపిన లాక్షణికులేలకో శబ్దాలంకార ప్రాసల కట్టి మహాకవుల ప్రయోగములను చూపరైరి.

శబ్దాలంకార తుల్యములై పద్యరచనమునకు నియతలక్షణములైన యతిప్రాసలతోపాటు పద్యమునకు మాత్రమే అలంకారములైన శబ్దాలంకార ప్రాసలను ఛందశ్శాస్త్రమునందు చెప్పుట సముచితము. ఇవి సహజమైన ఛందోఽలంకారములు. ఛందముతోపా టితరకావ్యలక్షణములను వచించిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో వీనిని ఛందఃప్రకరణము క్రింద సప్తమోల్లాసమునను, లేకాను ప్రాసాదులను శబ్దాలంకార ప్రకరణము క్రింద షష్ఠోల్లాసమునను పృథక్కరించి చెప్పెను. ఛందోదర్పణమునం దనంతుడు శబ్దాలంకార ప్రాసలను చెప్పెనేకాని అలంకార శాస్త్రమునకు సంబంధించిన శబ్దాలంకారములను ప్రస్తావించ లేదు. అప్పకవి ఈ విధానము నవలంబించెను.

కవిచింతామణి యందు ద్వితీయాక్షర ప్రాసభేదములతోపాటు శబ్దాలంకార ప్రాసలను, లేక లాటానుప్రాసలనెడి శబ్దాలంకారములనుకూడ జోడించి ప్రాసలు పదివిధములని చెప్పబడినవి. తరువాత "ఛేకోక్తి వర్ణావృత్తియు, యమకంబునని శబ్దాలంకారము లిమ్మగు,..." (3-62) ననియు తరువాత చిత్రకవిత్వ భేదములను పేర్కొనబడినవి. లక్షణ శిరోమణిలో శబ్దాలంకార ప్రాసలను చెప్పుచు లాట, లేక, వృత్త్యను ప్రాసలను కావ్యాలంకారచూడామణి, నరస భూపాలీయము లందలి లక్ష్య లక్షణములతో చెప్పబడినవి. తరువాత "......సమపదప్రాసంబును యమకంబును పాదాంతపాదాది ముక్తపదగ్రస్తమ్ములనఁదగు నివి ప్రాస భేదమ్ముల ప్రకారమ్ములు......" (4-466) అనియు చెప్పబడినది. దీనినిబట్టి పద్య రచనమునకు మాత్రమే పరిమితమైన శబ్దాలంకార ప్రాసలను,

అలంకార శాస్త్రమునకు సంబంధించిన శబ్దాలంకారములను విభజించి చూపవలసిన యావశ్యకమును తాతంభట్టును, రమణకవియు గుర్తించ లేదని తెలియు చున్నది. తరువాత వీరిరువురును ద్వితీయాక్షర ప్రాస భేదముల మధ్యలో ఆలంకారిక ప్రాసలను చెప్పి ప్రాసలయొక్క విభజనను పాటింపని వారైరి. పెద్దనానంతులు చెప్పిన లక్ష్యలక్షణములను రమణకవి స్వీకరించెను. కాలమునుబట్టి తాతంభట్టు, అనంతామాత్యునికి తరువాతి వాడగుచున్నాడు. అయినను ప్రాసల వర్గీకరణలో వారవలంబించిన విధానమును వీరనుసరింపలేదు. రంగకవికూడ శబ్దాలంకార ప్రాసలను ప్రత్యేకవర్గముగ చెప్పలేదు. ఇతడు భీమన చెప్పిన షడ్విధ ప్రాసలను, అనంతుడు చెప్పిన ద్వాదశ విధములైన ద్వితీయాక్షర ప్రాసలను స్వీకరించి క్రమముగ చెప్పియున్నాడు. ఇంతేకాక అనుప్రాసను చెప్పుటకు చూడామణిలోని షష్ఠోల్లాసము నుండి లాటానుప్రాస, ఛేకానుప్రాస లనెడి ఆలంకారిక ప్రాసలను గ్రహించి, కవిజనాశ్రయములోని అనుప్రాస లక్షణముకూడ నిచ్చినాడు. తరువాత [8]"అని యున్నదిగనుక కొందఱు ఇదే ఛేకానుప్రాసమనిన్ని లాటాను ప్రాసమనిన్ని గొందఱనుప్రాసమనిన్ని వాడుకొందురు గనుక దాని తెలుసుకొనేది", అని వ్రాసినాడు. ఈ విధముగ, రంగకవి అర్వాచీనుడయ్యును ప్రాసల విభజింపు వల్ల, పెద్దనానంతాదులు చూపిన శ్రద్ధను చూపడయ్యెను.

యతి ప్రాసలు, శబ్దాలంకార ప్రాసలు ఛందశ్శాస్త్రమునకుమాత్రమే సంబంధించినవి. ఛందమునకు నియతమగుటవలన యతిప్రాసలకు విశేష ప్రాముఖ్యము లభించినది. ఛందోఽంగములుగ స్థిరపడిన కారణము చేతను, శబ్దరక్షకములగుట చేతను వీనిని గూర్చి విశేషపరిశీలనము గావింపబడినది. శబ్దాలంకారప్రాసలు ఐచ్ఛికములైన అలంకారములగుట వలన వానికంతగ ప్రాముఖ్యము లభింపలేదు. శబ్దాలంకార బాహుళ్యమైన కావ్య మధమమగుటచే శబ్దాలంకార ప్రాసలకు కూడ విశేషాదరణము లేకపోయినది. కూచిమంచికవులు వీనిని తమతమ లక్షణగ్రంథములందు

8. అనంతరంగరాట్ఛందము(3-100)

చెప్పకుండుట దీనికొక నిదర్శనము. సాధారణముగ కావ్యానుశీలనమున అలంకారశాస్త్ర కథితములైన శబ్దాలంకారములను గూర్చియే ప్రస్తావముండునుగాని, శబ్దాలంకార ప్రాసలను గూర్చిన పరామర్శ కానరాదు. ఇవి ఛందస్సంబంధు లగుట దీనికొక కారణము. ఇట్టివిధమైన శబ్దాలంకార ప్రాసల అవగాహనమునకు ప్రామాణిక లక్షణగ్రంథమగు అప్పకవీయమున చెప్పబడిన లక్షణములను పరిశీలించుట యుక్తము కాగలదు.

ప్రప్రథమముగ సర్వవిధములైన ప్రాసలను, వాని స్వరూప స్వభావములనుబట్టి యీ దిగువరీతిని మూడు తరగతులుగ వర్గీకరింపనగును.

1. ద్వితీయాక్షరప్రాసలు :-

ఇవి ఛందోఽంగమైన ప్రాసమునకు సంబంధించినవి. ఇవి పద్యపాదముయొక్క ద్వితీయాక్షరమైత్రిని పాటించుటలో నేర్పడిన భిన్న భిన్న మైత్రులు. ఇవి పంద్రెండని అనంతుడును, పదునేడని అప్పకవియు చెప్పిరి. ఇవి శబ్దాలంకార తుల్యములుగాని, శబ్దాలంకారములు మాత్రముకావు.

2. శబ్దాలంకారప్రాసలు :

స్వభావమునందివి ద్వితీయాక్షర ప్రాసకు సంబంధించినను, స్వరూపమునందు భేదించునట్టివి. ద్వితీయాక్షరప్రాసలు ఛందమునకు (కొన్ని పద్యములకు) నియతమై నట్టివికాగా, నివి అనియతమైనట్టివి. ఇవి నాల్గు పాదములందును నిలువుగ ద్వితీయాక్షరముకాక యితర అక్షరముల మైత్రిని తెలుపుచున్నట్టివి. కావున నివి ఐచ్ఛిక ప్రయోగముకలవి యగుచున్నవి. ఇవి ఛందశ్శాస్త్రమునందు చెప్పబడిన శబ్దాలంకారములు. ఛందోబద్ధముకాని కేవల వచనమున వీని ప్రయోజనము లేదు. ఇవి యారని అనంతుడును, ఏడని అప్పకవియు చెప్పిరి.

3. వృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములు :-

ఇవి అలంకారశాస్త్రమునకు సంబంధించిన శబ్దాలంకారములు. ఛంద

శాస్త్రములో వీని ప్రస్తావ మనవసరము. ఛందోఒంగమైన ప్రాసము, అను ప్రాసమను శబ్దాలంకారమును పోలిసప్పటికిని లక్ష్యనిర్వాహణమున ప్రాసలోగాని, ఛందమునకు మాత్రమే అలంకారములైన శబ్దాలంకార ప్రాసలలోగాని వీనికి ప్రవమేయములేదు. ఇవి పద్యగద్యములు రెండింటి యందును ప్రయోగార్హమైనట్టివి.

## శబ్దాలంకార ప్రాసలు

అప్పకవి ద్వితీయాక్షర ప్రాసల కనంతరము శబ్దాలంకార ప్రాసల లక్షణమిట్లు చెప్పెను:

సీ. ప్రాసంబు సులభాక్షరంబైన సుకరంబు,
దుర్లభంబైన దుష్కరంబు.
తగ రెండుమూఁడు నాలుగు వర్ణములు పదం
బులనెల్ల నొకతంగిఁ బొనఁగెనేని
వరుసఁగా ద్వ్యములు ద్వంద్వప్రాసమును. త్ర్యక్ష
ర ప్రాసమును, చతుఃప్రాసమునగుఁ
బదములఁ దుదినొక్క పగిది యక్షరములు
దనరు నంత్యప్రాస మునకు నెందు

తే. బది బదిని వర్ణ మొక్కఁడు కరకు పెనఁ
బలుకఁ బరుసేని యది యనుప్రాసయయ్యెఁ
గంబు రోచన యవి యలంకార శాస్త్ర
కథితములు వీవినేదింటిఁ గానవలయు.

-అప్పకవీయము (3-881)

ప్రాసాక్షరము సులభమైనచో నది సుకరప్రాసము: కష్టతరమైనదైనచో నది దుష్కరప్రాసము. ప్రాసాక్షరములోపాటు తరువాతి యక్షరముకూడ, అనగా రెండువర్ణములను ప్రాసమైత్రిని కల్గియున్నచో నది ద్వంద్వ

ప్రాసము, అట్లే తరువాతి యక్షరమును కలుపుచు మూడువర్ణములకు త్ర్యక్షరప్రాసము, నాల్గు వర్ణములకు చతుఃప్రాసము. పదము (పాదము)ల తుదియక్షరము లొకేవిధముగనున్నచో నది అంత్యప్రాసము. ఒకే అక్షరము పలుమార్లు ఆవృత్తియైనచోనది అనుప్రాసము. ఈ ఏడును అలంకార శాస్త్రకథితములు. అని పై లక్షణపద్యముయొక్క సారాంశము.

ఇవి ఛందమునకు సంబంధించిన అలంకారము లగుటచేతను, అలంకార శాస్త్రమునందు చెప్పబడిన శబ్దాలంకారములను పోలియుండుటచేతను వీనినికూడ అలంకార శాస్త్రకథితములని అప్పకవి అభిప్రాయపడినాడు. కాని ఇవి అలంకారశాస్త్రమునందు చెప్పబడవు, ఛందశ్శాస్త్రమునందు మాత్రమే చెప్పబడును. ప్రాసాక్షరము పలుమార్లు ఆవృత్తియైనచో నది అనుప్రాసమను శబ్దాలంకారప్రాస మగును. ప్రాసాక్షరముకాక వేరైన అక్షరమైనచో నది అనుప్రాసమను శబ్దాలంకారమగును. ఈ అంశము పైఅప్పకవీయ లక్షణమునందు స్పష్టపరుపబడలేదు.

1. సుకరప్రాసము :-

సులభమైన యక్షరము ప్రాసస్థానమున నున్నచో నది సుకరప్రాసము. అనగా ప్రాసకూర్చుటకు సులభముగ తనంత తానుగ లభించు నక్షరమును, ఉచ్చారణమున వక్తకు, శ్రుతమున శ్రోతకు సుకరమైన యక్షరమునుగల ప్రాసము.

అప్పకవీయ లక్ష్యము : (3-382)

క. కమల దళ నయన సకలా
  గమవేద్య పురాణపురుష కరుణాకరమ
  ద్రమహీశ ప్రియతనయా,
  రమణ యనుచుఁ బలుక సుఖకర ప్రాసమగున్.

ఇందు మకారము ప్రాసస్థానమున కలదు. బిందు పూర్వకముకానట్టి ఏకవ్యంజనాక్షరమును, సాధారణముగ తరచు ప్రయోగింపబడు నక్షర

మును 'గం ప్రాసమును సుకరప్రాస మనవచ్చునని దీనినిబట్టి తెలియు చున్నది. రచనలోపాటుచ్చారణక్రమములందు సుకరమైనది సుకరప్రాస మగును.

2. దుష్కరప్రాసము :

సుకరముకానిది దుష్కరము. అనగా ప్రాసకూర్పుటకు సులభముగా కాక బహుప్రయత్నముచేత లభించు నక్షరముగల ప్రాసము దుష్కర ప్రాసము.

అప్పకవీయ లక్ష్యము : (3-383)

క. దుష్కృత గిరివ్రజాయుధ
పుష్కర సదనాధినాథ ముదనుతదవకో
నిష్కామహార యనన్
దుష్కరమని దీనిఁబలుకుదురు ప్రాసజ్ఞుల్.

ఇందు షకారకకారముల సంయుక్తాక్షరము ప్రాసస్థానమున కలదు. ప్రయోగబాహుళ్యము లేనిదియు, సంయుక్తవర్ణములు కలదియు, బిందు పూర్వకము నైనట్టిదియు అక్షరముగల ప్రాసమును దుష్కరప్రాసమన వచ్చును. దీనికి "దుష్కరప్రాసం బన్నది విషమాక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది" అని కవిజనాశ్రయము. సమము (సుకరము)కానిది విషమమని భావము. ప, క్ష, జ్ఞ, ఙ్క, ంఖ్య వంటి అక్షరములు విషమాక్షరములు. రచనములోపా టుచ్చారణ క్రమములందు కష్టతరమైనది దుష్కరప్రాస మగును.

సుకర దుష్కరప్రాసలు రెండును ద్వితీయక్షరప్రాసకు సంబంధించి నవి యగుటవలన నివి బిచ్చికములైన శబ్దాలంకారప్రాసలు కావుగదాయని ప్రశ్నింపవచ్చును. ద్వితీయాక్షర ప్రాసలను సుకర దుష్కరములని వింగ డించుట శబ్దాలంకార పరిగణనముకొరకని దానికి సమాధానము చెప్ప

వచ్చును. ఈ లక్షణములను ద్వ్యక్షరాది ప్రాసలకు కూడ వర్తింపజేయ వచ్చును కాని అట్టి యావశ్యకము కానరాదు.

3. ద్వంద్వప్రాసము లేక ద్విప్రాసము :-

పద్యపాదములు నాల్గింటియందు రెండవ యక్షరము సమముగా నుండుట సాధారణప్రాసము. దీనితోపాటు మూడవ యక్షరము కూడ సమముగా నున్నచో అనగా రెండక్షరములకు ప్రాస పాటింపబడినచో నది ద్వంద్వ ప్రాసము.

అప్పకవీయ లక్ష్యము : (3-384)

క. వ్యాసముని వినుతగోప
స్త్రీ సముదయ మానహరణ శృంగార రసా
వాసముగ విట్లు ద్వంద్వ
ప్రాసము కావ్యముఁ జెప్పఁ దగు నెల్లెడలన్.

ఇందు 'సము' అను రెండక్షరములకు ప్రాస పాటింపబడినది. ఇచ్చట సులభాక్షరములు కలవు కాని, యట్టి నియమము లేదని తెలియదగును. ప్రాసము వ్యంజనప్రధానమేకాని స్వర ప్రధానము కాకపోవుటచేత రెండక్షరముల ప్రాసయందును వ్యంజనసామ్య మావశ్యకముగాని స్వరసామ్యము కాదు. పై లక్ష్యమున స్వరసామ్యముండుట యాదృచ్ఛికమని గుర్తింపనది. ఒక్క అంత్యప్రాసకు తప్ప కరమ ప్రాసల కిదేనియమము వర్తించును. దీనికి భీమన, అతని ననుసరించిన లింగమగుంట తిమ్మన ద్వంద్వ, ద్విప్రాస లనెడి రెండు నామములను వ్యవహరించిరి. కరమ లాక్షణికులందరును ద్వంద్వ ప్రాసమను నామమునే వ్యవహరించిరి. ద్వ్యక్షరప్రాసమను నామ ముంచుట యుక్తము. ద్వ్యక్షరప్రాసాదులందు ప్రాసాక్షర మధ్యమమునందలి బిందువులకు కూడ ప్రాసమైత్రి కూర్పవలయును. ద్వితీయాక్షర ములోపాటు తరువాతి యక్షరము లొక్కొక్కదానిని కలుపుకొనుచు ప్రాస

చెల్లించుటవలన ద్వ్యక్షర ప్రాసాదులు పుట్టుచున్నవి.

4. త్ర్యక్షర ప్రాసము లేక త్రిప్రాసము :-

నాల్గు పాదములందును ప్రాసాక్షరముతోపాటు తరువాతనున్న రెండక్షరములుకూడ సమముగానుండుట త్ర్యక్షరప్రాసము. అనగా రెండవ, మూడవ, నాల్గవ అక్షరములకు, మొత్తము మూడక్షరములకు ప్రాసమైత్రి పాటింపబడుట.

అప్పకవీయ లక్ష్యము : (3-385)

క. తిరమగుఁ ద్రిప్రాసమునుం
దరమగు మురవైరి రూపు •తరుణులకు మనో
హరమగు దానవులకు భీ
కరమగుఁ దపసులకు ముక్తి •కరమగుననినన్.

ఇందు 'రమగు' అను మూడక్షరములకు ప్రాసచెల్లినది. దీనిని లాక్షణికులెల్లరును త్రిప్రాసమనిరి. ఈ నామముతోపాటప్పకవి త్ర్యక్షరప్రాసమను నామముకూడ నిచ్చినాడు. ద్వితీయాక్షరప్రాస భేదములం దనంతుడు చెప్పినది త్రికార ప్రాసమని గుర్తించునది.

5. చతుష్ప్రాసము :-

నాల్గుపాదములందును రెండవ, మూడవ, నాల్గవ, ఐదవ యక్షరములకు ప్రాసమైత్రి పాటింపబడుట చతుష్ప్రాసము. అనగా నాల్గక్షరముల ప్రాసము.

అప్పకవీయ లక్ష్యము: (3-386)

క ధీరుఁడు కమనీయ శుభా
కారుఁడు కమలావధూటి•కా మృదుహృదయా

దాయఁరు కుమతి జనాదిక
దూరుఁరు కమలాక్షుఁడనఁ జెంతుప్రాసమిదా!

ఈ పద్యమున 'రుఁరుకమ' అను నాల్గక్షరములకు ప్రాస చెల్లినది. ఇందు రెండక్షరముల నడుమనున్న అర్ధబిందువునకు కూడ ప్రాస చెల్లింపబడుట గమనింపదగినది.

6. అంత్యప్రాసము:-

ఇది 5వ సంఖ్యగల 'అంత్యప్రాస-ఒక వివరణము' అను ప్రత్యేక వ్యాసమున పరిశీలింపబడినది.

7. అనుప్రాసము:-

ఇది 6వ సంఖ్యగల 'ప్రాసము-అనుప్రాసము' అను ప్రత్యేక వ్యాసమున పరిశీలింపబడినది.

—:✱:—

# అంత్యప్రాస - ఒక వివరణము

అప్పకవీయమున ద్వితీయాక్షరప్రాసలను చెప్పుటకాదిలో-(3-289)

తే. ప్రాసము లెల్లఁ దుల్యాక్షరంబులైనఁ
గాని స్వర భేదమైన దోషంబులేదు
చరణముల కడఁ గూర్చు ప్రాసము లెల్ల
నన్నియు సమస్వరంబులై యమరవలయు.

అని ప్రాసాక్షరమైత్రి చెప్పబడినది. ఇందు ఛందమునకు నియతమైన ద్వితీయాక్షర ప్రాసకు, ఛందమునకు సంబంధించిన శబ్దాలంకార ప్రాసల లోని అంత్యప్రాసకుగల వ్యత్యాసము ప్రకటింపబడినది. ద్వితీయాక్షర ప్రాసలో హల్లుసమానముగ నుండవలెను. స్వరసామ్య మక్కరలేదు. పద్య పాదాంతమున కూర్చు ప్రాసలో, అనగా ఐచ్ఛికమైన అంత్యప్రాసలో వ్యంజన సామ్యముతోపాటు స్వర సామ్యముకూడ నావశ్యకము. దీనికి అప్ప కవిచూపిన లక్ష్యములు: (3-290, 291)

ఆ. సరసిజాతనేత్ర దురిత గుల్మలవిత్ర
హరితనూజమిత్ర గరుడపత్ర
ధరణీకళత్ర నీరదాసితగాత్ర
యనుచుఁ గూర్పవచ్చు నచ్చులెల్ల.

క. దురిత ద్విప హర్యక్ష
నరక మురాసుర విపక్ష నాళీకాక్ష
శరధి మహాలయ వక్ష
కరినాయకరక్ష హరము లిడు సురాధ్యక్ష.

ఇందలి మొదటి పద్యమున ద్వితీయాక్షర ప్రాసము ప్రాసయతి మూలమున చూపబడినది. ఆటవెలది ప్రాస నియతిలేని ఉపజాతిపద్యము. దీనియం దంగీకరింపబడిన ప్రాసయతి, యతికి పర్యాయముగ కూర్పు ప్రాస మైత్రి. అట్టి ప్రాసయతి ద్వారమున ఏ పాదమున కాపాదమునందే ప్రాసకు లక్ష్యమును గ్రహింపవలెను. నర-దురి, హరి-గురు, ధారు-నీర అని ద్వితీయాక్షర ప్రాసమున వ్యంజనసామ్యము (ప్రాసపూర్వాక్షర నియమముకూడ) పాటింపబడినది. స్వరభేదము చూపబడినది. స్వరసామ్య మక్కరలేదను విషయము నాల్గవ పాదమున ప్రత్యేకించి చెప్పబడినది. రెండవ పద్యమున నాల్గుపాదాంతములందు ర్యక్షా - క్షా - వక్షా - ధ్యక్షా అని అంత్యప్రాసకు లక్ష్యము. ఇందు వ్యంజన సామ్యముతోపాటు స్వరసామ్యముకూడ పాటింప బడినది. ప్రాస పూర్వాక్షరనియమము ప్రాసకు సామాన్య లక్షణమని గ్రహించునది. కాగా మొదటి పద్యము ద్వితీయాక్షరప్రాసకు, రెండవ పద్యము అంత్యప్రాసకు లక్ష్యము లగుచున్నవి.

ప్రథమ పద్యమున, చరణ మధ్యమున పదాంతములందుగల ప్రాస యాదృచ్ఛికమనియు, లేక శబ్దాలంకార నిర్వహణ కొరకనియు గ్రహింప వలెను. ద్వితీయ పద్యమున ద్వితీయాక్షరప్రాస నిర్వహణము, పద్య (కందము) రచనముకొరకు కగుటచే నది లక్ష్య ప్రదర్శనార్థము కాదని గ్రహింపనగును. అంత్యప్రాసకు ప్రథమ పద్యముకూడను, ద్వితీయాక్షర ప్రాసకు ద్వితీయ పద్యముకూడను లక్ష్యములుగా ప్రదర్శించుట అప్పకవి యుద్దేశముకాదు.

పై లక్ష్యములను పరామర్శించు సందర్భమున శ్రీ రావూరి దొర స్వామిశర్మగారి అప్పకవీయ భావప్రకాశికయందు "(290 ప.)... మీదు మిక్కిలి యిందే యంత్యానుప్రాసయు సంఘటింపబడినది-నేత్ర...విత్ర మిత్ర...పత్ర; శత్ర... గాత్ర — అన్నిటియందును రెండవయక్షరము త్రకారము. హల్సామ్యమేకాక స్వరసామ్యమును గలదు; అన్నియు అకారాంతములు."

"నేత్ర-రాత్రి అనురీతి సంత్యానుప్రాస యుండరాదని యెఱుఁగునది. అంత్యానుప్రాస ప్రదర్శనమునకై మఱియొక పద్యము చూపబడినది."

"291 వ. హర్మ్యాహా ; విపక ; నాళికాహా ; వహా ; రక ; అర్ఘ్యహా."

ఇందు సంత్యప్రాసలో కకారమున్నది. అన్నియు అకారాంతములు. కాని కొన్ని హ్రస్వాంతములు, కొన్ని దీర్ఘాంతములు. హ్రస్వదీర్ఘ భేదమే కాని స్వర భేదము లేదని యరయవలయును." అని కలదు. (పుట-202)

పై విమర్శయందు ప్రకటింపబడిన (1) 290వ పద్యమున అంత్య ప్రాసకుకూడ లక్ష్యము కలదనుట ;(2) చరణ మధ్యమమునకూడ అంత్య ప్రాస ప్రయోగింపబడినదనుట ; (3) 291వ పద్యములోని అంత్యప్రాసను బట్టి స్వరసామ్యమున హ్రస్వదీర్ఘ భేదము లేదనుట ; (4) అంత్యప్రాసకు అంత్యానుప్రాసమని ప్రయోగింపబడుట అనెడి విషయములను పరిశీలింప వలసియున్నది.

ఇదే సందర్భమున శ్రీ వేదుల రామశాస్త్రి గారి అప్పకవీయ వ్యాఖ్యాన వివరణమున "290వ....... మరియు నీ పద్యములో విద్యాను సారము 1, 2, 3 పాదములలో అంత్యప్రాసమున్ను కూర్చి ఇందు అత్రైత్రియు (పై అచ్చున్ను సమానాకృతి కలదియై) ఉండవలెనని చూపినాడనియు, ఇట్లే ఎల్లెడ నెఱుంగవలెననియు భావము. ఇట్లే 3వ పాదమున గురు నియమమున్ను చూపినాఁడు."

"291 వ.— ఇది ప్రాస నియమముగల కందపద్యము. ఇందు 1, 2, 3, 4 పాదముల ప్రాసలలో ఒకచో (రిఅని) ఇకారయుక్తముగాను, రెండవ పాదమున (ర అని) అకారయుక్తముగాను, ఇట్లే మూడునాలు పాదముల ఒకచో అకార యుక్తమై మరియొకచో ఇకార యుక్తమై ఇట్లు రకార ప్రాసము భిన్న భిన్న స్వరములు కలది యైనను పైని చెప్పిన చొప్పున చెల్లుబడి యయ్యెననియు అట్లే అంత్యప్రాసమును విద్యాను సారముగా కూర్చి అందలి స్వర సమాకారత్వము చూపినాఁడనియు. నెఱుంగునది." (పుట-291, 292) అని కలదు.

ఈ విమర్శయందును 290వ పద్యమున ద్వితీయాక్షర ప్రాసతో పాటు అంత్యప్రాసకు కూడ లక్ష్యము చూపబడినట్లును, 3వ పాదము నందే గురునియమము చూపబడినట్లును; 291వ పద్యము ద్వితీయాక్షర ప్రాసకు కూడ లక్ష్యముగా స్వీకరించినట్లును చెప్పబడినది. భావప్రకాశికలోని పరిశీలనాంశములతోపా టివిషయములు కూడ సమన్వయము గావించి పరిశీలింపబడు చున్నవి.

లక్షణ పద్యమగు తేటగీతి (ప. 289) యొక్క మొదటి రెండు పాదములు ద్వితీయాక్షర ప్రాసకును, కడమ రెండుపాదములు అంత్య ప్రాసకును లక్షణములు. ఈ క్రమము ననుసరించి తరువాతనున్న లక్ష్యములందు మొదటిది (ప. 290) ద్వితీయాక్షర ప్రాసకనియు, రెండవది (ప.291) అంత్యప్రాసకనియు గ్రహింపనగును. ఒక పద్యమునందే రెండింటికి లక్ష్యములు చూపబడినచో రెండు లక్ష్య పద్యము లనావశ్యకములు; రెండవది పునరుక్తి యగును. తదుపరి లక్షణ పద్యమున అంత్య ప్రాసకు "చరణములకడ గూర్చు ప్రాసమ"ని చెప్పబడినది. అనగా పద్య పాదాంత ప్రాసమే అంత్యప్రాసమని యర్థము. దీనినిబట్టి పాద మధ్య ప్రాసమును అంత్యప్రాసమని యనరాదని తెలియుచున్నది. అప్పకవీయమునందు అంత్యప్రాస శీర్షికతో చూపబడిన పద్యము (3-389,390) లందు పాదాంత్యములందే లక్ష్యము కలదు గాని పాదమధ్యమమున లేదు. కవిజనాశ్రయమున "మఱి యంత్యప్రాసం బన్నది మొదటి పాదము కడపటి యక్షరంబు నాలుగు పాదముల కడపటనిడి చెప్పునది." (సంజ్ఞ-87) అని స్పష్టముగ చెప్పబడినది. ఛందోదర్పణము మొదలుగా గల ప్రముఖ చ్ఛందో గ్రంథములందు లక్ష్యలక్షణములు పాదాంతములనే నిర్దేశించు చున్నవి. లక్షణసారసంగ్రహమునందు యతిప్రాసల లక్ష్య లక్షణముల నన్నిటిని సీసమాలికయందు చూపబడుట వలన అంత్యప్రాసకు "పొదలు రాఘవదాన •కదనజయోల్లాస, కదియు నంత్యప్రాస•మిది సువాస"(1-65) అని ప్రదర్శించుట తప్ప వేరు గత్యంతరము లేకపోయినది. కాబట్టి దీనిని పాదమధ్యమమని సమర్థించుట తగదు. ఇంతేకాక అంత్యప్రాస ఛంద స్సంబంధమైనట్టిది. అనగా పద్యములకు మాత్రమే వర్తించునట్టిది.

అట్టిచో అంత్యమనిన చరణాంతమే కాని పదాంతమును, చరణ మధ్య మ్మున్ను కాదుగదా! ఆటవెలది యందలి ప్రాసయతి, లక్షణసామ్యముచే ప్రాసమే యగుచున్నది. కావున ప్రాస లక్ష్యమును ప్రదర్శించుటకు యోగ్యమగుచున్నది, కాని ఆటవెలదియొక్క పాద మధ్యమము పాదాంత మెన్నటికిని కాదు. అట్లు చెప్పుట అశాస్త్రీయము.

మరియు రెండవ లక్ష్య పద్యమునందు 'విపక్ష, రక్ష' అనునవికూడ పాదాంత్యప్రాసకు వలెనే సంబోధనాంతములగు చుండుట వలన నంత్య ప్రాస లక్ష్యమునందు వానిని కూడ స్వీకరింపవలెనని యనవచ్చును. ఈ సందర్భమున ఛందోదర్పణ వ్యాఖ్యలోని యీ దిగువ వాక్యములను పరిశీలింప దగును. "అంత్యప్రాసము పాదాంత్యములకే వర్తించుననుటచే నిట నంత్యశబ్దమునకుఁ బాదాంత్యమని యర్థమగును." "అంత్య ప్రాసోదాహరణములు సాధారణముగా సంబోధనాంత పదములతోఁ గాన వచ్చు చున్నవి. అట్టివానియందుఁ బాదమధ్యమమున నున్న సంబోధన పదములును ప్రాస యుక్తములు కావలయునను నియమము లేదు. కను కనే యీ పద్యమున (ఛందో 1-75) 'సతత వినుత' యనునది యవి రుద్ధమయ్యెను."1 దీనినిబట్టి 'విపక్ష,రక్ష' యనునవి సంబోధనాంతము లైనప్పటికిని పాదమధ్యమము లగుట చేతను హ్రస్వములైన కారణము చేతను దీర్ఘాంతములైన అంత్యప్రాసతో సమముగ లక్ష్యములు కాజాలవు. ఇట్టి విధమైన పరిశీలనముచే (అ) మొదటి లక్ష్య పద్యమునందు అంత్య ప్రాసకు లక్ష్యములేదు. నేత్ర...... విత్ర; మిత్ర......పత్ర; శత్ర... గాత్ర అని యున్నది శబ్దాలంకారమైన అంత్యానుప్రాసమే కాని, ఛందస్సంబంధమైన అంత్యప్రాసకాదు. (ఆ) రెండవ లక్ష్యపద్యము నందలి పాద మధ్యమమునగల 'విపక్ష, రక్ష' అను వానిని అంత్యప్రాసకు స్వీకరింపరాదు అని నిర్ణయింప నగును.

మొదటి లక్ష్య పద్యమున, మూడవ పాదమునందు మాత్రమే గురు నియమము (ప్రాస పూర్వాక్షర నియమము) చూపబడినట్లు శ్రీ వేదుల

---

1. ఛందోదర్పణము - తత్త్వదర్శినీ వ్యాఖ్య. శ్రీశ్రీభాష్యం వేంకట నరసింహభాష్యకారాచార్యులు (పుట-68)

వారి విమర్శయందు కలదు. వారు చెప్పలేదుకాని మొదటి పాదము నందును నేత్ర .....విత్ర అని గురు నియమము పాటింపబడినది.

రెండవ లక్ష్య పద్యమున చరణాంతములందు 'ర్యాషా, కాషా, వషా, ధ్యషా' అని యుండి అంత్యప్రాసకు లక్ష్యమగుచున్నది. ఇందు వ్యంజన సామ్యముతో పాటు స్వరమైన ఆకారము (దీర్ఘము) కూడ నాలుగుపాదము లందును సమముగా నున్నది. ఈ ద్వితీయ పద్యము లక్షణమున కనుగుణ మైన లక్ష్యమగుచుండ, భావప్రకాశిక విమర్శయందు పాదమధ్యమమున గల 'విపక్ష,రక్ష' అనువానిని కూడ స్వీకరించుటవలన యనవసరముగ "హ్రస్వ దీర్ఘ భేదమే కాని' స్వరభేదము లేదని యరయవలయున"ని నిర్ణ యము చేయవలసి వచ్చినది. లక్షణమున చరణాంత ప్రాసమని యుండుట వలన, లక్ష్యమునందు చరణాంత ప్రానలో దీర్ఘమగు ఆకారమే నాలుగుపాద ములందు సమముగా నుండుటవలన, అట్టి నిర్ణయము చేయుట లక్ష్యమునకు విరుద్ధమగుచున్నది. శబ్దాలంకార ప్రాసలలో అంత్యప్రాసయొక్క లక్షణ ముతో పాటు స్వరసామ్యమునందు హ్రస్వ దీర్ఘముల భేదము లేదనెడి లక్షణ మును అప్పకవి చెప్పి యుండలేదు. అట్టి లక్షణము, పూర్వము (ప్రాసకు- అంత్యప్రాసకు భేదము చూపునప్పుడు) చెప్పబడినదని భావించినచో అంత్య ప్రాస శీర్షికతో చూపిన లక్ష్యములందొక్క చోటనైనను పాటింపబడి యుండెడిది. కాని యచ్చట రెండు లక్ష్య పద్యముల (3-389, 390) లోను అకారస్వర దీర్ఘమే (అకారమే) నాల్గు పాదములకు సమముగా పాటింపబడినది. కవిజనాశ్రయము, ఛందోదర్పణము, సులక్షణసారము లక్షణసారసంగ్రహము, లక్షణశిరోమణి వంటి సుప్రసిద్ధ లక్షణగ్రంథము లలో అంత్యప్రాస యొక్క లక్ష్యములందు హ్రస్వ దీర్ఘ స్వరములం దొక్కటియే ప్రయోగింపబడినది కాని రెండును ఒకే పద్యమున ప్రయో గింపబడ లేదు. తదుపరి అంత్యప్రాస లక్షణమునందు "అన్నియు సమ స్వరములై యమరవలయు" ననెడి వాక్యమునకు స్వరము సమాన మైనచో హ్రస్వ దీర్ఘముల భేదములేదనెడి అర్థముచెప్పుటకు తగిన ఆధారము లేదు. అయినను ఇట్టి అభిప్రాయము యతిలో నంగీకరింపనగును కాని ప్రాసయం దాలోచింప దగినది. ప్రాసలో వ్యంజనసామ్య ముండవలె ననెడి

లక్షణమును పురస్కరించుకొని ఒకపాదమునందొకే వ్యంజనముండి తరువాతి పాదమునం దదే వ్యంజనముయొక్క ద్విత్వరూప ముంచిన నచ్చటి ప్రాసము తప్పుచున్నది. అట్లే అంత్యప్రాసమున స్వరసామ్య మన్నచో, ప్రథమ పాదాంతమున నేస్వరమున్నదో దానినే (హ్రస్వదీర్ఘ నియమములతో) కడమ పాదములందును పాటించినచో నది అంత్యప్రాస మగును. స్వరమునకు హ్రస్వదీర్ఘములనెడి భేదము లేదనిన లక్షణమును వేరొక విధముగా చెప్పవలసి యున్నది. రెండవ లక్ష్యపద్యమున పాద మధ్యమమునందలి అక్షరములను కూడ నంత్యప్రాసకు లక్ష్యములుగా తీసి కొనుటవలనను, పాదాంత్యములందు హ్రస్వ దీర్ఘములు రెండును కలిగిన లక్ష్యములు లేకపోవుట వలనను పై విధమైన అభిప్రాయము ప్రకటింప నగును. ఈ పరిశీలనముచే పద్యచరణాంత్య ప్రాసలో హ్రస్వ దీర్ఘ స్వర భేదము కలదని నిర్ణయమగుచున్నది.

మరియు, రెండవ లక్ష్యపద్యము అంత్యప్రాస కుద్దేశింపబడినది. అందలి ద్వితీయాక్షర ప్రాసమును ప్రాసకు లక్ష్యముగా గైకొనుటలో పొరపాటు లేదుకాని, లక్షణ రచనను బట్టియు లక్ష్య ప్రదర్శనను బట్టియు ఒక క్రమమును పాటించుట యందౌచిత్యము కలదు. ఈ క్రమమును బట్టి మొదటి పద్యము ద్వితీయాక్షర ప్రాసకు, రెండవ పద్యము అంత్య ప్రాసకు లక్ష్యములని చెప్పుట, లక్షణ గ్రంథములోని రచనమున కుచిత మైనట్టిది.

వర్ణావృత్తికి ఛందశ్శాస్త్రమున ప్రాసమనియు, అలంకారశాస్త్ర మున అనుప్రాసమనియు వ్యవహారము. ఛందశ్శాస్త్రమునందలి ప్రాసము పద్య పాద ద్వితీయాక్షర నియతికి సంకేతము. ప్రాస లక్షణములు కలిగి యుండుటవలనను, పద్యములకు సంబంధించిన వగుటవలనను ద్విప్రాసాది ఐచ్ఛిక ప్రాసలకు ప్రాసమను నామము తగియున్నది. పద్యమునందు ప్రాసాక్షరము పలుమార్లు ప్రాసేతర స్థానములందు తిరిగి వచ్చిన దానికి అనుప్రాసమను నామమేర్పడినది. ఇది ఛందశ్శాస్త్ర మునకు సంబంధించినది. అలంకార శాస్త్రమునందలి అనుప్రాసలో పలు భేదములు కలవు. ఛందశ్శాస్త్రమున అనుప్రాస మొక్కటియే. వీని నిర్వ

పాఠమున ఛందశ్శాస్త్రమున ప్రాసాక్షరమును స్వీకరించుట, అలంకార శాస్త్రమునం దేయక్షరమునైనను స్వీకరింపరగి యుండుట యనునది భేదము. సుకరప్రాస, దుష్కరప్రాస, ద్వి, త్రిప్రాసలవలెనే అనుప్రాస, అంత్య ప్రాసలు కూడ ఛందశ్శాస్త్రమునందలి శబ్దాలంకారప్రాసలు. ఇచ్చట అంత్య ప్రాసను అంత్యానుప్రాసమని యనరాదని తెలియదగును. లేనిచో సుకర, దుష్కరాది ప్రాసలను కూడ సుకరానుప్రాస, దుష్కరానుప్రాస అను విధమున చెప్పవలసి వచ్చును. వీనియందు అనుప్రాస ధర్మముండక పోవుటచే వీని ననుప్రాసలనుట పొరపాటగుచున్నది. మరియు కేవల మను ప్రాస నేమనవలయునను ప్రశ్న ఉదయించును. లక్షణ గ్రంథములన్నిటి యందును అంత్యప్రాసమను నామమే ప్రయుక్తముకాని, అంత్యానుప్రాస మను నామము లేదు.

అంత్యప్రాసమను కీర్తికలో అప్పకవి చెప్పిన లక్షణము : (8-387, 388)

క. తొలుతను గురు లఘువుల లో
పల నెయ్యది పదము తుదిని ప్రాసమునకు దా
పల నిల్పు నదియె నాల్గగు
గుంకద ప్రాసముల మొదలఁ గూర్పఁగ వలయున్

తే. అంత్యమితుది వ్రాయి దాపలి యక్షరంబు
గురువయిన ప్రాస మొక్కయక్కరమె యగును
గాక లఘువైన వర్ణయుగ్మంబు నడుచు
స్వర విభేదంబుగాక కావ్యంబులందు.

ఈపద్యములందు అంత్యప్రాసాక్షరముయొక్క పూర్వాక్షరనియమము, దాని వలన అక్షర సామ్యమున కలుగు మార్పులు చెప్పబడినవి. ప్రథమ పాదమున అంత్యప్రాసాక్షరము యొక్క పూర్వాక్షరముగురువైనచో గురువును, లఘువైనచో లఘువును, నాల్గు పాదాంత్యప్రాసాక్షరములకు పూర్వమున నుంచవల యును. పద్యము యొక్క పాదాంతము లన్నిటియందు ప్రాసపూర్వాక్షరము

గురులఘువులలో నేదో ఒక్కటియే యుండవలెను కాని, ఒక పాదమున గురువు మరియొక పాదమున లఘువువలె నుండరాదు. అంత్యప్రాసాక్షరము యొక్క పూర్వాక్షరము గురువైనచో, ఒక్క అక్షరమునకే అంత్యప్రాసను పాటించవలెను; లఘువైనచో రెండక్షరములకు పాటించవలెను. స్వర విభేద ముండరాదు. స్వర వ్యంజనముల రెండింటి సామ్యము కావలయును.

దీనికి అప్పకవి చూపిన లక్ష్యములు : (3-389, 390)

క. నందాంగనా కుమారా
మందరగిరి ధీర దనుజ•మద సంహారా
బృందావన విహారా,
కందర్పాకార రాధి•కాశ్రీజారా ।

క. గోపవధూజన మదనా
గోపాలన చతుర కుంద •కుట్మలరదనా
గోపారి విజితకదనా
గోపతి వాహాస్త్రధవళ •గోసమవదనా.।

ఇందలి మొదటి పద్యమున అంత్యప్రాస నాల్గుపాదాంతములందును రేఫ ఆకారములను, గురు పూర్వకమును సమముగా కలిగియున్నది గురు పూర్వకమగుటచే ఒకే అక్షరమునకు అంత్యప్రాస పాటింపబడినది. (మారా-హారా-హారా-జారా). దీనిని గురు పూర్వక ఏక వర్ణాంత్యప్రాస మనవలెను. రెండవ పద్యమున అంత్యప్రాసాక్షరము లఘుపూర్వకమగుటచే అంత్యప్రాస రెండక్షరములకు కూర్పబడినది. మరల ఆ రెండక్షరముల అంత్యప్రాసయు లఘుపూర్వకమగుట గుర్తింపదగినది (మదనా-రదనా-కదనా-వదనా). దీనిని లఘుపూర్వక ద్వివర్ణాంత్యప్రాసమనవలెను. లేక అంత్య ద్విప్రాస మనవచ్చును. దీనినిబట్టి ఏకవర్ణాంత్యప్రాస గురుపూర్వక మనియు, ద్వివర్ణాంత్యప్రాస లఘుపూర్వకమనియు తెలియుచున్నది.

దీని లక్ష్య లక్షణములు ఛందోదర్పణమునందిట్లు చెప్పబడినవి (1-76,77):

క. అగణిత విభవమ్మూర్తీ।
నిగమాగమ వితతవినుత। నిర్మల మూర్తీ।
జగదభి రక్షణ వర్తీ।
యగునంత్యప్రాసయుక్తమందుచితకీర్తీ।

పాదాంత్యప్రాసలో నిది సుస్పష్టముగ అంత్యప్రాసను తెలుపు చున్నది. దీనికంటె నధికముగ అనంతుఁడిట్లు చెప్పుచున్నాడు:

క. మొదలిటి ప్రాసమెకాని
తుదిఁ యంత్యప్రాస మనఁగ తేదలుకాని
కదియించవలయు దాని
వదలెడిఁగిన బుధులు కృతులఁ బలుకఁజూపి।

పాదాదిప్రాసముకాని, యీ అంత్యప్రాసముకాని ఏర్పడను పైని చెప్పఁబడిన పద్ధతిప్రకారము కూర్పవలెనని దీని తాత్పర్యము. ఈ రెండును పద్యములకున్నట్టి అంత్యప్రాసము చరణాంత్యప్రాసమనియు, స్వరస్థానములందు ప్రాసవ్యతిరిక్త భేదములు కలదనియు నిర్ణయము గుచున్నది.

లాక్షణికు లెల్లరు నిదే తీరున వచించిరి. ఒక్క రంగరాజు మాత్రము "అనియమమునఁ బద్యమునకుఁ బ్రాసాక్షర మెద్దియో యదియె యంత్య మందుండునట్లు చెప్పిన మఱియు తెన్నుఁగా నుండునవి యందురు." అని వ్రాసెను.[2] ఇదియొక లక్షణ విశేషము. ఈ విధముగ నితరులు చెప్పినట్లు లేదు. పాదాది ప్రాసాక్షరమే అంత్యప్రాసకును స్వీకరింపఁబడిన ప్రసిద్ధ లక్ష్యములు కానరావు. ఇట్లు రచించిన తెన్నుగా నుండునని చెప్పిన రంగ కవియు లక్ష్యమును చూపలేదు. సాధారణముగ లక్ష్యములున్నను అనంతుఁడు చెప్పిన విధమున నుండుట గమనార్హము.



2. అనంతరంగరాట్ఛందము (4-21)

వలనను, ప్రసిద్ధ చ్ఛందోగ్రంథములందిట్టి మైత్రి చెప్పబడకపోవుట వలనను అసంగతమైన యీ మైత్రిని గూర్చి అప్పకవి చేసిన విమర్శ యుక్తముగా నున్నది.

ఈ మైత్రి సులక్షణసారము, లక్షణదీపిక, శ్రీధరచ్ఛందము, లక్షణశిరోమణి మొదలగు లక్షణ గ్రంథములలో చెప్పబడినది. దీనికి యశవర్గద్వయ యతి, యవర్గయతి-శవర్గయతి యను నామాంతరములు కలవు. సులక్షణ సారమునందు దీని లక్షణ మిట్లు చెప్పబడినది: (ప.151)

క. యశవర్గ ద్వయమునకును
విశదము దమ యక్షరములు వెలయఁగ వశౌఁ
గుశలమగు పదము ధరలో
శశి నౌదలఁ దాల్చు నతఁడు హరుఁడను మాడ్కిన్.

ఈ పద్యము స్వల్పమై పాఠభేదములతో 'శ్రీధరుని' దని లక్షణ శిరోమణిలో నీయబడినది.[6] లక్షణశిరోమణి యందీయతి 'యశవర్గద్వయయతి' యని యిట్లు చెప్పబడినది: (4-319)

తే. యరలవశషసహల బిందులాదినిడక
యున్న యశవర్గయుతయతు లొప్పుఁ గృతుల
యరలవలయందు శషసహాక్షరములందు
... ... ...

---

6. క. యశవర్గ ద్వయ యతికిన్
విశదముగఁ దదక్షరములు వెలయగ వశలౌ
కుశలత లమరును సంపద
శశి నౌదలఁ దాల్చు నతఁడు హరుడను మాడ్కిన్.
(లక్షణశిరోమణి 4-320)

ఈ లక్షణమున అంతస్థోష్మములకు పరస్పరము యతి చెల్లునని చెప్ప బడినది. ఇది వేరొక వింతలక్షణము. అంతస్థోష్మములకు తమలో తమకు మైత్రి లేకపోయినప్పుడు, పరస్పరము మైత్రికలదని చెప్పెడి లక్షణము నిరాధార మగుచున్నది. సరసయతి ప్రకారము య-హల్లకు మాత్రము మైత్రి చెల్లును.

ఇట్టివిధమైన మైత్రులకు ప్రశస్తమైన లక్ష్యములు లేకపోవుటవల నను, మైత్రి చెల్లుననుటకు శాస్త్రపరమైన హేతువులు లేకపోవుటవలనను ఈ లక్షణము లన్నిటిని అగ్రాహ్యము లనదగును.

## 4. అగ్రాహ్యభేద వర్గ యతులు

ప ఫ బ భ వ లకు చెల్లు యతిమైత్రి అభేద వర్గయతి. వీనికి మకారముతో మైత్రిచెల్లుట లాక్షణికము కాదు. కాని ప ఫ బ భ వ మ లకు యతిమైత్రి చెల్లునను లక్షణము కవిజనాశ్రయ ప్రతులలో ప్రక్షి ప్తము కాబడి యుండుట వలన నీ మైత్రిని అప్పకవి నమ్మతింపక యగ్రాహ్యభేద వర్గ యతి యని నిరసించినాడు. దీనికి అప్పకవి చూపిన లక్ష్యలక్షణ పద్యమిట్లున్నది.

క. ధరఁ బభ మాక్షరములు
పరువడి నీయేనుగూడ •వాతోఁ జెల్లున్
సరి సంభావనవడి యన
మరు దీమము లేమ కీర •వాణి యనంగన్.

(అప్పకవీయము 3-268)

ఈ లక్షణము ననుసరించి ప ఫ బ భ మ అను ప వర్గాక్షరము లైదును పకారముతో యతిమైత్రికి చెల్లును. దీనికి సంభావనవడి యని పేరు. పైపద్యముయొక్క నాల్గవ పాదమున మ-వలకు యతి కూర్పబడి లక్ష్య మగుచున్నది.

'వబయోరభేదః' అను ప్రమాణముచే వబల మైత్రి లభేద యతి మైత్రి యైనది. వర్గజయతి ననుసరించి ప ఫ బ భలకు యతిచెల్లును. ఈ రెండు మైత్రుల వలన ప ఫ బ భ వలకు మైత్రి అభేదవర్గయతి యని యేర్పడుచున్నది. వీనికి మకారముతో మైత్రి ప్రసిద్ధచ్ఛందో గ్రంథములందు చెప్పబడలేదు. కాని పైలక్షణమున ప ఫ బ భ మ అను పవర్గాక్షరము లైదును వకారముతో యతిమైత్రికి చెల్లునని చెప్పబడుట వలన దానిని అప్పకవి అగ్రాహ్యాభేదవర్గ యతి యని చెప్పవలసి వచ్చినది. ప ఫ బ భ లు పూర్ణానుస్వార పూర్వకములైనచో నవి తద్వర్గానునాసికమగు మకారముతో మైత్రి చెల్లునని బిందుయతి చెప్పుచున్నది. అట్లే పూర్ణబిందు పూర్వకమైన వకారమునకు మకారముతో మైత్రి చెల్లునని మవర్ణవిరామము చెప్పుచున్నది. కాని కేవల మ-వలకు యతి మైత్రి లేదు. ఇట్టి అభిప్రాయముతో నప్పకవి పైలక్షణమును విమర్శించుచు "పంచమ వర్గాక్షరము లైదింటిలో నున్న వ-బల కభేద యతి గనుకను ప్రథమ ద్వితీయ చతుర్థ వర్ణములు వకారమునకు నభేద వర్గయతులు గనుకను అవియు నిలుచును. మకారము నడవదు. ఇది విచారించక చెప్పినాఁడు గనుక నిదియు అబద్ధమని తెలిసికొనునది" (అప్పకవీయము 3-269) అని వ్రాసెను.

పైలక్షణ పద్యమునం దీయతిమైత్రి (మ-వ) సంభావన వడియని చెప్పబడినది. 'సంభావన'యన చక్కఁగా తలంచుట. ముకార యతిచే ముకారమునకు పుఫుబుభులకు యతిచెల్లును. అభేదవర్గయతి ననుసరించి వ-వలకు యతిచెల్లును. ఈ రెండు యతుల నాధారముగగొని మ-వలకు, ము-వులకు యతి చెల్లునని సంభావింపబడుటవలన పైలక్షణము చెప్పబడినది. ప్రసిద్ధచ్ఛందోగ్రంథములందీయతి చెప్పబడలేదు కాని రాఘునాథయ్య లక్షణదీపిక, నెల్లూరి ఆదెన్న లక్షణరాజీయములందు చెప్పబడినది.[7]

ఈ లక్షణమునకు ప్రామాణిక కావ్యములందు లక్ష్యములు కానరావు కాని విరళముగ ప్రయోగములు కనబడుచున్నవి. ముకారము ఓష్ఠ్యమైన

---

7. తెలుగుభాషలో ఛందోరీతులు (పుట-357)

అనునాసికవర్ణము. వకారము దంతోష్ఠ్యమైన అంతస్థవర్ణము. ఇట్టి విభేదము చేత మైత్రి చెల్లదనవలసియున్నది. వకారము దంతజములోపాటు ఓష్ఠజము కూడనైయున్న కారణముచేతను, ఉచ్చారణమున కొన్ని సందర్భములందు అనునాసిక్య లక్షణముకూడ కలిగియున్న కారణముచేతను సామీప్య లక్షణములను కలిగియున్న మకారములో మైత్రికి అర్హతను కలిగియున్న దన వలెను. వ్యవహారమున 'మామ' శబ్దమునకు 'మావ' అని వినబడుటకిదియే కారణము.

మ - వల మైత్రికి లక్ష్యములు :

'మది మది నుండి యేను బెంగవంతుఁడనై'

-ఎఱ్ఱన హరివంశము (8-198)

'వసుమతి గారవించుచు క్రమ్మంపగ కుందిన నేలకగ్గ'

-కావ్యాలంకారచూడామణి (8-44)

'ప్రసప్ప యెంతయును క్రమ్మంపరి యట్లు'

-బసవపురాణము (పుట-348)

'వృశ్చికములకు బుధుఁడు స్త్రీమిథునములకు'

-రంగరాట్ఛందము (2-208)

ఈ మైత్రికి ప్రామాణిక కావ్యములందు లక్ష్యబాహుళ్యము లేకపోయినప్పటికిని, అగ్రాహ్యవనియని నిరసింపవలసినంత యావశ్యకము కానవచ్చుటలేదు.

దీని తరువాత నీ 'అగ్రాహ్యభేదవర్గయతి' శీర్షిక క్రింద కొన్ని అభేద యతులుకూడ చెప్పబడినవి. వీనికి వేరుగ 'అగ్రాహ్యభేదయతులు' అను శీర్షిక నుంచుట యుక్తము.

# అగ్రాహ్యాభేదయతులు

అప్పకవి చూపిన లక్ష్యలక్షణ పద్యము :-

తే. భరిత భువనార్ణవంబుతో ◦వ్రంత సరియె,
రమ్యమణి రాజరాజితో ◦లక్క సరియె,
లలిత వీణారవంబుతో ◦ఢక్క సరియె,
యనఁగఁ జెల్లు నభేదాఖ్య ◦నమరు వళ్ళు.

-అప్పకవీయము (3-270)

ఈ పద్యమున లక్ష్యమును ప్రదర్శించుచు అభేదయతులు చెప్పబడినవి. మూడు పాదములందు క్రమముగ భ-వ లకు, ర-ల లకు, ల-ఢ లకు యతి కూర్పబడి అభేదతచే మూడు విధములైన యతులేర్పడుచున్నవి. ఈ పద్యమును అప్పకవి విమర్శించుచు- "ఈమూఁటిలోపలను భకార వకారములకు నభేదవర్గయతి గనుకఁ బ్రయోగింపవచ్చును. లవర్ణ ఢవర్ణములకు నభేద వర్గయతులు గావుగావునఁ బ్రయోగింపరాదు. రవర్ణమునకును లకారమునకు గ్రాహ్యంబుగాదు, వానికిని లక్షణ విలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు; అవియును వివరించెద" (అప్పకవీయము 3-271) అని వ్రాసెను. ఇందలి వ-భల మైత్రి అప్పకవికి సమ్మతమైన అభేదవర్గయతి, ర-ల మైత్రియు, ల-ఢల మైత్రియు అప్పకవి మతమున అసాధువులు. కాగా ల-ఢల, ర-లల మైత్రులయొక్క సాధుత్వాసాధుత్వములనుగూర్చి చర్చింపవలసి యున్నది.

## ల-ఢల మైత్రి :-

ల-ద ల కభేద యతిమైత్రిని అప్పకవి అంగీకరించెను. లకారమునకు దకార వర్గాక్షరములతో అభేదవర్గయతి యనునదిలేదు. అనగా లకారమునకు అనునాసికము బాసిన టవర్గాక్షరములతో మైత్రిలేదు.

కావున పై పద్యమందలి ల-ఢల మైత్రిని అప్పకవి తిరస్కరించినాడు. ల-ఢ లకు సంబంధించిన అభేదవర్గయతి లేకున్నను డకారముయొక్క మహా ప్రాణాక్షరముతో మాత్రము లకారమునకు మైత్రి చెల్లుననుటలో వ్యతి క్రమము కానరాదు. అల్పప్రాణమునకు చెల్లెడి యతిమైత్రి మహాప్రాణము నకును చెల్లుననుట సమంజసము. లఢలకు మైత్రినిచెప్పినచో నభేదవర్గయతి నంగీకరించినట్లగుననెడి యభిప్రాయముతో నది చెల్లదని అప్పకవి చెప్పినాడు. ఈ సందర్భమున శ్రీరావూరివారు వ్రాసిన "ఇందభేద యతి యనవలెనేకాని యభేదవర్గయతి యనుట పొరపాటు" అను వాక్య మీ క్రింద పరిశీలింపబడుచున్నది.

అప్పకవి అగ్రాహ్యమని చెప్పిన పై పద్యము స్వల్పమైన పాఠభేద ముతో సులక్షణసారము (ప-130)నం దభేదయతియందిట్లు చెప్పబడినది.

తే. లలిత వీణారవంబుతో •డక్క సరియె
రమ్యమణి రాజరాజితో • లక్క సరియె
భరిత భువనార్ణవంబుతో •వంక సరియె
ననఁగను నభేదనామాఖ్య •యతులు నెలఁగు.[8]

ఇందలి 'డక్క' శబ్దముయొక్క డకార మల్పప్రాణము. 'ఢక్క' శబ్దము యొక్క తద్భవము 'డక్క'. అప్పుడు ల-డల యతిమైత్రి అప్పకవికి సమ్మతమగును. కావున అప్పకవి చూపిన పై అగ్రాహ్య లక్ష్యమునందు 'డక్క' శబ్దముండవలయుననియు, ఐనచో నది అభేదయతి యగునుకాని యభేదవర్గయతి కాదనియు శ్రీ రావూరివారి యభిప్రాయము.[9] అట్లైన

---

8. ఇదే పద్యము చిత్రపుభీమన ఉత్తమగండచ్ఛందస్సు నందలిదని లక్షణ శిరోమణి(4 - 161)లో గలదు. అందు 'ఢక్క' శబ్దము మహాప్రాణ యుతమై యున్నది.

9. అప్పకవీయ భావప్రకాశిక (పుట-188)

యెడల నిరంతటి విమర్శ కాస్కారమే లేదుకదా! ఇచ్చట అప్పకవి వాక్యము అనే గ్రహించి పరామర్శించుట సమంజసము. అప్పకవి స్పష్టముగ 'లవర్ణ ధవర్ణములకు నభేదవర్గయతులును గావు గావునఁ బ్రయోగింపరాదు' అని వ్రాసియుండుటచే 'ధక్క' శబ్దము నే ఆతడు స్వీకరించినట్లు నిర్ణయము చేయ దగును. ఈ పద్యము నాతడు 'అగ్రాహ్యాభేదవర్గయతి' శీర్షిక క్రింద పేర్కొనుట కూడ దీనిని ధ్రువపరచుచున్నది. కావున అప్పకవి మతము నే స్వీకరించి విమర్శించుట యుక్తము.

లకార టవర్గముల కభేదవర్గయతి లేకపోవచ్చునుగాని, ల-ద లకభేద యతి చెల్లినప్పుడు ధకారమునకుకూడ చెల్లునని చెప్పదగును. కావున దీనిని అభేదయతియందే చెప్పవలయును. పర్యవసానముగ అప్పకవి ల-దలమైత్రి నంగీకరించి ల-ధల మైత్రిని తిరస్కరించుటయందు స్వారస్యము లేదని నిర్ణయ మేర్పడుచున్నది.

ర-ల లమైత్రి: -

ర-లల మైత్రి అప్పకవి కంగీకారము కాదు. కాని ఇతర లాక్షణి కులు కొందరంగీకరించిరి. ర-లలు రెండును క్రమముగ మూర్ధన్యము, దంత్యమునై సమీపోత్పత్తి స్థానములను కలిగిన అంతస్థ వర్ణములు. రెండింటికిని జిహ్వాగ్రమే కరణమైయుండి బాహ్య ప్రయత్నమున నాదము, అల్పప్రాణమునైన వర్ణము లగుచున్నవి. ఇట్టి విధమైన సామ్య ముచే ర-లలు రెండును ఉచ్చారణముపం దభేదతను కలిగియుండి పరస్పర గ్రాహ్యము లగుచున్నవి. ఈ కారణము చేతనే ర-లలతో కూడిన అనేక పదములకు రూపద్వైవిధ్యము చెప్పబడినది. 'రలయో రభేదః' అనెడి ప్రమాణము ప్రసిద్ధమైనట్టిది. ప్రామాణిక కావ్యము లందు ర-లలకు యతిమైత్రి చెల్లెడి ప్రయోగములు కనబడుచున్నవి. కావున ర-లలకు యతిమైత్రి నంగీకరింపవలసి యున్నదని నిర్ణయము చేయదగును. కొన్ని పదములలో ద్వైరూప్య మంగీకృత మగుటచే సరూ పాక్షరమునే పఠించి సమయతి యని సరిపెట్టుకొనుట కంటె అభేద యతి నంగీకరించుటలోనే స్వారస్యము కలదు. లేనిచో ద్వైరూప్యము

చెప్పుట కర్థములేక ఆప్రక్రియ వ్యర్థమగును. కావున అప్పకవి ర-లల మైత్రిని అగ్రాహ్యమని చెప్పుటయందు సామంజస్యము లేదని తెలియు చున్నది. లింగమగుంట తిమ్మన, రమణకవి, రంగకవి, వేంకటరాయ కవులు తమతమ లక్షణ గ్రంథము లందీ ర-లల యతి నుపదేశించిరి.

'భరిత భువనార్ణవంబులో' నిత్యాది పద్యమును విమర్శించుచు అప్పకవి, లక్షణ విలాసమున గైకొనబడినవని యీ దిగువ పేర్కొనిన ఉదాహరణములను వివరించినాడు:

శృంగార నైషధము (1-110)

క. కైలాటరాయ యభినవ
లీలామకరాంక చంద్ర రేఖాంకుర చూ
డాలంకార బదాంబురు
హాలింగిత సుఖిత విర్మలాంతః కరణా

(అప్పకవీయము 3-272)

రామాయణము (యుద్ధకాండము-2323)

క. దానవ సుందరు లత్తఱి
జానకి నందలము మీఁద సమ్మద మొదవం
గానిలుప శారదాభ్ర వి
లీనిత నేపారు చంద్ర రేఖయ పోలెన్.

(అప్పకవీయము 3-273)

పై పద్యములందు పాదాదిని లకారము, యతిస్థానమున రేఖాశబ్దము లోని రేఫము ఉండుటవలన ర-ల లకభేదయతి చెల్లుచున్నది. ఈ మైత్రిని సమ్మతింపని వాడగుటవలన అప్పకవి "సంస్కృతమునందు రేఖా-లేఖా శబ్దములు రెండును గలవు గనుక ఈ రెండు పద్యములందును చెప్పిన రేఖాశబ్దము మొదల తృతీయాంతస్థమని యెఱుంగునది." (అప్పకవీయము

3-274)అని వివరించినాడు. ఈ లక్ష్యములందు ర-ల ల క భేదయతి లేదని అప్పకవి అభిప్రాయము. రేఖా శబ్దమునకు రేఖాశబ్దము రూపాంతరము కావున రేఖా శబ్దమును పఠించినచో ర-లలక భేదయతి మైత్రి చెప్పవలసిన యావశ్యకములేదు. ఈవిషయమును అప్పకవి రేఖాశబ్దము యొక్క మొదటి యక్షరము అంతస్థములగు య, ర, ల, వలలోని మూడవ యక్షరము (తృతీయాంతస్థము) అని స్పష్టపరచినాడు. దీనివలన ద్వితీయాంతస్థమగు రేఫము మొదటి అక్షరముగాగల రేఖాశబ్దము కాదని విదితమగుచున్నది. లేఖా శబ్దమునకు రేఖాశబ్దము రూపాంతరమని అప్పకవియే చెప్పినాడు. కనుక ర-లలయతి నంగీకరించి, పై శృంగార నైషధ, యుద్ధకాండము లందలి పద్యములు ర-లలయతికి లక్ష్యము లగుచున్నవని ప్రకటింప వచ్చును. కాగా నీ యతిని గ్రహించుటయే సమంజసము.

గౌరన - హరిశ్చంద్రోపాఖ్యానము

ద్వి॥ చీఁకటి ఁరియుంచుఁ ఁజిఱునవ్వు, పసిఁడి
రేకులతో నెదిఁరించు చెక్కులును
(అప్పకవీయము 3-275)

దీనిని పరామర్శించుచు అప్పకవి "కొందఱు 'రేకులతో మురాఁశించు చెక్కులును' అని చదువుదురు. అది వ్రాఁత తప్పు గాని కవి హృదయము గాదు." (అప్పకవీయము 3-276) అని ర-శ లకు యతి మైత్రి లేని పాఠమును సమర్థించినాడు. పాఠాంత రమున ర-శలకు యతి చెల్లుటవలన నది తత్కవిచే రచింపబడిన వాక్యము కాదని ప్రకటించినాడు. ఒక వాక్యమునకు పాఠాంతరము అన్నప్పు డందేది కవి హృదయమని నిర్ణయించుటకు వానియొక్క అర్థస్వారస్యమును ప్రమాణముగ గ్రహించుట ప్రథమ కర్తవ్యము. దానివలన నిర్ణయము కుదరని యెడల యతిప్రాసాది విషయాంతరము లను గ్రహించి నిర్ణయింపవలెను.

పైవాక్యము గౌరన హరిశ్చంద్ర ద్విపదలో పౌరస్త్రీలు చంద్ర మతిని వర్ణించు సందర్భములోనిది. ఆమె పలువరుస, మోవి, చిరునవ్వు

మొదలగువాని వర్ణనముతోపాటు, ఆమె చెక్కిళ్ళు బంగారు రేకుల కంటె రమ్యతరములుగా నున్నవని పైవాక్యమున గౌరన వర్ణించు చున్నాడు. ఇచ్చట 'ఎదిరించు' అనుదానికి తిరస్కరించు, అధిగమింప ప్రయత్నించు అనెడి అర్థములను చెప్పకొనవచ్చును. పాఠాంతరమైన 'మురాళించు' అనుదానికి 'దిగదుడుచు' అనెడి అర్థమును నిఘంటువులు చెప్పుచున్నవి. ఒకదాని ఆధిక్యమును ప్రకటించుటకు దాని ముందు కడమ వన్నియు దిగదుడుపని చెప్పెడి లోకోక్తి కలదు. దీనిని దృష్టి యందుంచుకొని 'మురాళించు' అని కవి ప్రయోగించి యుండునని తలపనగును. తిరస్కరించు అనెడి అర్థము వచ్చునట్లు చెప్పుటకు 'ఎదిరించు' అనుదానికంటె 'మురళించు' అనెడి పదము యుక్తముగా నున్నట్లు తోచుచున్నది. దీనికి పూర్వమే ఈ పద మీకావ్యమున 'ముత్తెంపుఁ జిప్పల •మురళించు మోము' (పుట-33) తని ప్రయోగింపఁ బడినది. కాగా మురళించు, మురాళించు అనెడి పదములలో దేనిని స్వీకరించినను ర-ల లకు యతిమైత్రి చెల్లినట్లగుచుండుటవలన, అది అప్పకవికి సమ్మతము కాకపోవుటచే 'ఎదిరించు' అనెడి పాఠమే ప్రామాణికత నందినది. దీనికి ర-లల యతి యాకావ్యమున వేరొకచోట లేకపోవుటయు నొక కారణము. కాని అర్థస్వారస్యమును బట్టి మురళించు, మురాళించు అనెడి పదములం దుత్తరోత్తరములు సమంజసములుగా నున్నవి. కాగా ఇచ్చట ర-లల యతి నంగీకరించి 'మురాళించు' (మురళించు) అనెడి పదమే కవి ప్రయుక్తమని తలంచుట సమంజసము.

వసుచరిత్ర (3-162)

శా॥ ఓలంబాలక యోలయోలయన నోఁలోలంచు మేలఁ బునః
లో లంబాలక యోర్తు గ్రుంకి విరిపళ్లు ల్దిన్మి తూఁటాడి కెం
గేలంబూని కటారునె న్నెగనె నఁశీణాంటునాథాంటుజా
క్షీలోకంబు జయించి వారల యశః శ్రీఁ దెచ్చు చందంబునన్.

(అప్పకవీయము 3-277)

ఇందలి రెండవ పాదమునగల 'లోలంబ' శబ్దమునకు 'రోలంబ' అని రూపాంతర ముండుటవలన అప్పకవి "ఈ పద్యము రెండవ చరణము మొదలను 'లోలంబాలక గ్రుంకి' యని కవి హృదయము. ఇది గానక కొందఱు 'ఇందిందిరశ్చంచరీకో రోలంబో బంభరోపిచ' అని నిఘంటున నున్నదని 'రోలంబాలక' యని చదువుదురు; ఇటని రామరాజభూషణుని తలంపుగాదు"(అప్పకవీయము 3-278) అని విమర్శించెను. ఈ వసుచరిత్ర పద్యమున 'లోలంబాలక' అనునదియే కవిప్రయుక్తమనియు, కాని కొందరు తుమ్మెదలవంటి ముంగురులు కలది యను నర్థముగల 'రోలంబాలక' యనెడి పదమును గ్రహింతురనియు, అలాగుననైన యెడల ర-లలకు యతిమైత్రి కూర్చినట్లగుటచేత నిషిద్ధమైన అట్టి యతి చెల్లించుట రామరాజభూషణుని యభిమతము కాదనియు అప్పకవి యభిప్రాయము. ర-లల యతిమైత్రి ప్రసక్తముకాని 'లోలంబ' పదమునే వసుచరిత్ర కారుడు ప్రయోగించెననియు, దానికి రూపాంతరమగు 'రోలంబ' పదమును పఠించుట తగదనియు నాతని నిర్ణయము. 'లోలంబాలక' పదమునకు లో-లంబ-అలక = లోపల వ్రేలాడుచున్న ముంగురులు కల యనియర్థము. 'రలయోరభేదః' అనెడి ప్రమాణముచే లోలంబ, రోలంబ యగును. అప్పుడు తుమ్మెదలవంటి ముంగురులుకల యని యర్థము చెప్పవచ్చును. కాగా 'రోలంబ' శబ్దమునకు గల అర్థస్వారస్యము 'లోలంబ' శబ్దమునకు లేదనవలసి యున్నది. అప్పకవి మతమున ర-లలకు యతి లేక పోవుటచేత, 'లోలంబ' శబ్దమును గ్రహించినచో కావ్యమునకు ప్రాణప్రదమైన స్వరసార్థము లోపించుచున్నది. ర-ల లకభేదత నంగీకరించి 'రోలంబ' శబ్దమును గ్రహించినచో నాప్రయోగము కవిసమయ సమన్వితమై రసవదర్థమునకు నెలవై యున్నది. ఈ సందర్భమున అహోబలపతి రేఫలకారముల కభేదము గనుక విశ్రమము చెల్లుననియు, వసుచరిత్రమునందే 'రాయంచకాళ్లఁ దొలకయమున్న' (4-25) అని ప్రయోగింపబడుటచే రామరాజభూషణునకు ర-లల యతి సమ్మతము కావున, అప్పకవి యభిప్రాయము 'అవిచారితాభిధానమ'నియు విమర్శించెను.[10]

---

10. అహోబల పండితీయము (పుట-167)

వసుచరిత్ర వ్యాఖ్యాతయగు సోమకవి, అప్పకవి మతము నను సరించి ర-లల కభేదము నంగీకరింపలేదు. 'లోలంబ' శబ్దమే కవి ప్రయుక్తమని తలంచి అహోబలపతి వాక్యములను గౌరవింపక 'రాయంచ . ' ఇత్యాది పాఠమునకు 'కలహంసకాళ్ళ దఃవులక మున్నె' యనెడి పాఠాంతర ముండుటచే రామరాజభూషణుని మతమున రేఫ లకార ములకు విశ్రమములేదని వ్యాఖ్యానించినాడు.11

ర-లల కభేద యతిమైత్రి లేదనెడి అప్పకవి అభిప్రాయమును కూచి మంచి తిమ్మకవి పునరుద్ఘాటించినాడు. వసుచరిత్ర లక్ష్యము నాతడు పరామర్శించుచు -

క. రలల కభేదంబవి యి
మ్ములఁ గొఁదఱు వసుచరిత్రఃమున లక్ష్యమువి
చ్చలగతి నారసికలుగం
బలుకుదు రది యెల్ల కల్ల ఃపర్వత నిలయా ।12

అని ప్రకటించి "... రేఫలకారములకు అభేదం చేసుకున్నారు. అది సరిః కాదు. 'లోలంబాలక యోర్తు గ్రుంకి' యనవలెను. లో(న్)-నీళ్లలోను, లంబాలకయనఁగా విస్తారమైన యలకలు గలది యోర్తుగ్రుంకి అని పాఠం సుష్ఠువు" అని వ్రాసెను. "రాయంచ..." ఇత్యాది లక్ష్యమునకు "రాయంచ కాళ్ల దొరలకమున్నె" అనెడి పాఠాంతరము సుష్ఠువని చెప్పెను. తదుపరి ద్విరూప కోశమునుండి "మార్జారశ్చాపి మార్జాలో బిడారశ్చ బిడాలవత్......" మొదలుగాగల, ద్వైరూప్య మంగీకరించిన పదజాలమును పేర్కొనెను.13 దీనివలన నాతడు కొన్ని పదములం దంగీక రింపబడిన ర-లల అభేదతను గుర్తించియు, యతిమైత్రి నిర్వహణమున ర-లల మైత్రిని సమ్మతింపని వాదగుచున్నాడు. ఇందు మొదటిదానిపై ఆధారపడి రెండవదానిని సమ్మతింపవలసి యున్నది. సుప్రసిద్ధ పండితుడు,

11. వసు చరిత్ర (పుట-103)
12. తిమ్మకవి లక్షణసార సంగ్రహము (2-192)
13. అందే (2-194)

కవిసార్వభౌముడునైన తిమ్మకవి వంటివారు ఇందలి సత్యమును గుర్తింప లేకపోవుటకు ; యతిలో ర-లల కభేదము చెల్లదనెడి సంప్రదాయము పైగల ప్రగాఢ విశ్వాసము కారణ మనిపించును.

లాక్షణిక చక్రవర్తి కూచిమంచి వేంకటరాయకవి ర-లలకు యతిమైత్రి నంగీకరించి, అప్పకవి మతమును ఖండించినాడు. లోలంబాలకేత్యాది ప్రయోగములను దిద్దినారు కాని దిద్దుపాటుకాని ప్రయోగములున్నవని 'లీలాహాస్యకలా ప్రసంగముల ను ∙ద్రేకిం'...' (కాశీఖండము 6-210) మొదలుగాగల లక్ష్యములను పేర్కొనినాడు. అహోబలపతి పండితుని వాక్యముల నుట్టంకించి తన యభిప్రాయమును సమర్థించుకొనినాడు.[14]

ఉచ్చారణమున ర-లలకుగల అభేదతవలనను, రేఖా-లేఖా యనెడి విధమున కొన్ని పదములకు ద్వైరూప్య మంగీకృత మగుటవలనను, ప్రామాణిక కావ్యములు కొన్నిటియందు ర-లల యతిమైత్రికి లక్ష్యము లుండుటవలనను, కొన్ని లక్షణగ్రంథములం దీయతిమైత్రి చెప్పబడుట వలనను అప్పకవి అగ్రాహ్యమని చెప్పినప్పటికి ర-లల యతిమైత్రి నంగీక రింపవలసియున్నదని గుర్తింపనగును.

పై లక్షణ పద్యమున చెప్పబడని ఱ-లల మైత్రి :

రేఫ-శకటరేఫలమైత్రి లాక్షణిక సమ్మతము కాదు. కాని యతి ప్రాసలు చెల్లిన లక్ష్యము లనేకములు కలవు. ర-లలకును, ర-ఱలకు గల మైత్రివలన ఱ-లలకు మైత్రి కూర్పనగును. ఇతర లాక్షణికు లీమైత్రిని చెప్పలేదుకాని కూచిమంచి వేంకటరాయుడు "ర-లల కనగా ఱకారముకు లకారముకున్ను, రేఫము లకారముకున్ను అని అర్థము. 'రశ్చ ఱాశ్చరౌ' అని ఏకశేషము" అని అభేదయతియందు వ్రాసెను.[15] 'నీ, లిగి

---

14. సుకవి మనోరంజనము (పుట-147, 148)
15. అందే (2-268)

కొల్లగొన్న నెలుంగిడున్ జెవికవల్ ఁజిక్కించు...' (రామాభ్యుదయము 2-21) వంటి ప్రామాణిక లక్ష్యములుండుటచే అ-లల యతిమైత్రి నంగీక రింపవలసి యున్నది.

న ణ, ర ఱ. ల ళ లకభేదమైత్రి:-

క.. నణలను రెండక్కరముల
కును వడిఁ బ్రాసంబుఁ బెట్టుకొనవచ్చుఁ గృతిన్
విను రఱల కిట్లు పెట్టం
జను లళల కభేద మరయ సర్వజ్ఞనిధీ.

-అప్పకవీయము (3-279)

న-ణలకును, ర-ఱలకును, ల-ళలకును అభేదము ప్రసిద్ధమగుటచే యతిప్రాస మైత్రులు చెల్లునని ఈలక్షణము చెప్పుచున్నది. దీనిని అప్పకవి. "ఈ చెప్పిన మూఁటిలోపలను మొదలఁ జెప్పిన నణలకును సరస వడియుఁ గడను జెప్పిన ల-ళల కభేద విరతియుఁ గనుక నీ రెండును గూర్ప వచ్చును; నడుమను జెప్పిన రఱలకు 'రయోస్తు నిత్యంస్యాత్' అని శబ్ద శాసన సూత్రము కలిమింజేసి యేకతర యతులగుటనుం గూర్పరాదు; అటు గాన నీ పద్యమును ప్రశస్తముగాదు" అని విమర్శించినాడు. (అప్ప కవీయము 3-280)

ఇందాతడు యతిమైత్రులనేగాని ప్రాసమైత్రులను పరామర్శింపలేదు. ఇచ్చట అగ్రాహ్యయతులను వివరించుటవలన ముందు చెప్పబోవు ప్రాస లలో వీనిని పరిశీలింపవచ్చునని యాతడు భావించి యుండవచ్చును. ఇట్లే అగ్రాహ్య సంబంధవళియందు ద-డలకు యతిప్రాసలు లక్షణమున చెప్ప బడి యున్నను విమర్శించునప్పుడు ప్రాసనుగూర్చి ప్రస్తావించలేదు.

పై లక్షణమున మూడు మైత్రులు చెప్పబడినవి. అవి అభేద లక్షణ ముచే మైత్రికి చెల్లునని చెప్పదగును. కాని ఇది సంపూర్ణముగ అప్పకవికి సమ్మతముకామిచే సరసవడిచే న-ణల యతిని, అభేదవిరతిచే ల-ళల యతిని సమ్మతించి; ఏకతరయతిచే ర-ఱల యతిని తిరస్కరించెను. కావున పై లక్షణ పద్యము నప్పకవి యగ్రాహ్యమనెను. ఈ మూడక్షర

యుగళములకు నభేదత నంగీకరించి యతిప్రాస మైత్రులను చెప్పుట యుక్తము.

(1) న-ణలకు యతిమైత్రి ప్రసిద్ధమైనట్టిది (సరసవళి). ప్రాస మైత్రియందు అప్పకవి చెప్పిన ఉభయప్రాస లక్షణము ననుసరించి వ్యాకర‌ణ సూత్రముచే నకారమున కాదేశమైన ణకారముతో సిద్ధనకార ణకారములకు మైత్రి కూర్పవచ్చును. (అప్పకవీయము3-329)సహజ న-ణ లకు ప్రాసమైత్రి అప్పకవీయముచే సమర్థింపబడుటలేదు. అనగా వనము వీణ వంటిపదములలోని సిద్ధ న-ణలకు ప్రాసచెల్లదు. న ణలు రెండును అత్యంతసన్నిహిత స్వభావముకల నాదములు, అనునాసికములును. రెండును క్రమముగ దంత్యమును, మూర్ధన్యమునైన సమీపోత్పత్తి స్థానములను కలిగి యున్నవి. రెండింటికిని జిహ్వాగ్రము కరణము. ఇట్టి సామ్యములవలన స-ణ లొకదానికొకటి గ్రాహ్యము లగుచున్నవి. గుణము-గొనము వంటి ప్రకృతి వికృతులందు ఒకదానికొకటి ఆదేశమగుచున్నవి. ఉచ్చారణములోని కొన్ని సందర్భములలో న-ణ లొకదాని కొకటి ప్రయోగింపబడుట వ్యవహార ప్రసిద్ధము. ప్రాచీన కాలమునుండియు సిద్ధ న ణ లకు ప్రాస ఘటింపిన లక్ష్యము లనేకములు కలవు.

ఉదా.- పెనగుఁ తీఁగలు దొడ్డ ఫణులు గాఁగ
-కుమారసంభవము (4-101)

దనుజుల-మనుజ-యే,చినబల-ని,ర్గుణతను
-భాగవతము (6-276)

మనకుఁ గలయట్టి బాహుత్రాణ గణము సుతులు
-మొల్ల రామాయణము (యుద్ధకాండము1-88)

ఇట్టి విధమైన హేతువులచే అప్పకవి చెప్పకున్నప్పటికిని, సిద్ధ న-ణలకు ప్రాసమైత్రి నంగీకరింపవలసి యున్నది.

(2) అప్పకవీయమందలి అభేదయతి(3-87), అభేదప్రాసము (3-363) లననుసరించి ల-ళలకు యతిప్రాసలు రెండును చెల్లును.

(౩) రేఫ, శకటరేఫలమైత్రి యతిప్రాసలు రెండింటి యందును లాక్షణికుల కంగీకారము కాదు. యతిమైత్రి చెల్లదని చెప్పుటకై కవిజనాశ్రయాది చ్ఛందోగ్రంథములందు ఎక్కటి (ఏకతర) వడి ప్రత్యేకముగ చెప్పబడినది. ప్రాసలోకూడ వీనికి మైత్రి లేదని చెప్పుటకై అప్పకవి ప్రాసవైరమను నొకదానిని పనిగట్టుకొని ప్రాసభేదములందు చెప్పినాడు. ప్రాచీనకాలమునుండియు ర-ఱలలో దేనికదియే ప్రయోగార్హమై తంత్సాంకర్య మలాక్షణికమనుట సంప్రదాయ మయ్యెను.

భీమన, విన్నకోట పెద్దన, అనంతామాత్యుడు, అప్పకవి మొదలగు ప్రామాణిక లాక్షణికులు ర-ఱల కభేద మైత్రిని నిషేధించిరి. తాతంభట్టు, శారదాదర్పణకారుడు, రంగకవి మొదలగువారు ర-ఱల కభేద యతిమైత్రి చెల్లునని యంగీకరించి ప్రాసమైత్రి మాత్రము చెల్లదని యభిప్రాయపడిరి. ఎక్కటి వడిని చెప్పిన లింగమగుంట తిమ్మకవి ర-ఱల యతిమైత్రిని ప్రత్యేకముగ 'ఱావడి' యను పేర యిట్లు వచించెను:

క. ధారుణి ఱానడి యనఁదగు
ఱా రేఫకు రేఫ ఱాకు రహిఁ వడిఁ దనరున్
నీరమ్య కీర్తి నగుఁ దా
రారాజున్నలువ బలుగు ఱాబసనంగన.
(సులక్షణసారము. ప-163)

ఈవిధముగ కొందరు లాక్షణికులు రేఫశకటరేఫలకు మైత్రి లేదని ప్రకటింప, మరికొందరు యతిమైత్రి చెల్లునుగాని ప్రాసమైత్రి చెల్లదనిరి; ఇంకను కొందరు యతివిషయమై ప్రసంగించిరి కాని ప్రాసను ప్రస్తావించలేదు. లాక్షణిక వాక్యములం దీరీతిని ఏకవాక్యత లోపించుటకు, వ్యవహారమున ర-ఱలకు గల అభేదత వలన మహాకవులు యతిప్రాసలందు కూడ అభేదతను పాటించుటయే కారణమనదగును. అర్వాచీన కాలమునందు ర-ఱల కభేద మైత్రి చెల్లదను వాదము లక్షణగ్రంథములకే పరిమితమైనదని చెప్పనగును.

ర-ఱలు రెండును దంతమూలీయములు. రెండింటికిని జిహ్వాగ్రము కరణము. బాహ్యప్రయత్నమున నాదము, అల్పప్రాణము నగుచున్నవి. రేఫము తాడితము, శకటరేఫము కంపితమునైయుండి ఉచ్చారణమున సన్నిహితత్వమును కలిగి యున్నవి. ఇట్టివిధమైన సామ్యములవలన ఉచ్చారణమునం దభేదతను కల్గియుండి మైత్రికి అర్హమగుచున్నవి. ర-ఱల యొక్క అభేదమైత్రిని లాక్షణికులొకవంక నిషేధించుచున్నను, తత్సాంకర్యమును నివారించుట మహాకవులకే అనివార్యమైనది. తిక్కనాదులే ఒకే పదమును ఒకచోట రేఫతోడను, వేరొకచోట శకట రేఫ తోడను ప్రయోగింప జొచ్చిరన్నచో,[17] వాని యభేద మెంతటి దుర్భేద్యమో గమనింపనగును. అనేక కావ్యములందు ర-ఱలకు యతి ప్రాసమైత్రులు చెల్లెడి లక్ష్యములు కనబడుచున్నవి. ఈ అభేదమైత్రిని నిరాకరించి రేఫ, శకటరేఫ ప్రకరణములను రచించిన కూచిమంచి తిమ్మకవి -

క. అంసాని పెద్దకవి పిం
గళి సూరన రామభద్ర కవివర్యుఁడు పి
ల్లలమఱ్ఱి వీరభద్రుఁడు
కలిపిరి గద కృతుల ఱాలఁ గడు రేఫములన్.

(తిమ్మకవి లక్షణసారసంగ్రహము 3-320)

అని ప్రకటించినాడు. తరుపరి చింతామణి వ్యాఖ్యాతయైన బాలసరస్వతి చంద్రికాపరిణయమునందు "తెక్కలమాటు నన్నుచఱించి లభింపుము కీర్తి పుణ్యముల్" అని రేఫ, శకటరేఫలకు యతి చెల్లించుటను ప్రస్తావించి "ఇటు వలెనే మహాకవులకు రేఫ, ఱకారములపట్ల పరిశీలన లేక పోయినది" అనికూడ వ్రాసినాడు.[18] భాగవతమును లాక్షణికు లుదాహరింప

---

17. 'ఱాయో కాకిట్లు రూపఱక వినవోర్చెన్' (భీష్మపర్వము 3-419)
'రాతి పయిని నుప్పు గొనుట ఱ్ఱాత్రి ..'(ఆనుశాసనికపర్వము4-110)
18. తిమ్మకవి లక్షణసారసంగ్రహము (3-339)

కుండుటకు పోతరాజు ర-అలకు మైత్రి చెల్లించుటయే కారణమని ముద్దరాజు రామన, అప్పకవి, అహోబలపతి సూచించుటను పేర్కొని వారు పరిశీలనము లెన్నగా జేసినవాడు కారని వ్రాసినాడు పోతరాజు వైశిష్ట్యము నుగ్గడించి, బుధజనహితుడైన బమ్మెర పోతరాజు ర-అలకు భేదమును గుర్తించడని అజ్ఞులు కొందరందురు, కాని యా మహాత్ముని కవితకట్టి లోపము లేదని ప్రకటించినాడు. తదుపరి పోతన భాగవతమున కొంతభాగము నశించుటకు కారణము చెప్పి, దానిని వెలిగందల నారయాదులు పూరించిరనియు, నందుచే నాభాగములందే ర-అలకు మైత్రి కూర్పబడినదికాని, పోతన కవీంద్రుని కవితయందట్టి లాక్షణిక దోషము లేదనియు లక్ష్యప్రదర్శన పూర్వకముగా నిరూపించినాడు.[19] ఈవిధముగ ర-అలమైత్రి విషయమై కవి వందిత లోకమునం దనాది నుండియు భేదాభిప్రాయములు నెలకొని యున్నవి. అయినను కవులు మైత్రి కూర్చుటయు, లాక్షణికులు నిషేధించుటయు కొనసాగుచునే యుండెను.

ర-అలకు యతిప్రాస మైత్రులు చెల్లిన కొన్ని లక్ష్యములు :

'రవియను దివ్వె కేతువు చెఱంగున...'

(ఆముక్తమాల్యద 2 7)

'శ్రేణుల్ గట్టి నభోంతరాళమున బాఱెం బక్షులు...'

(మనుచరిత్ర 3-12)

'ఱెక్కలు గట్టుకొని దివిజారిపు మేదల...'

(ప్రభావతీ ప్రద్యుమ్నము 4-86)

'తరుణి విజ్ఞాన మీసూక్ష్మ. మెఱింగికొనుము'

(కాశీఖండము 3-69)

---

19. తిమ్మకవి లక్షణసార సంగ్రహము (3-340 నుండి 345)

'నరవర యిటు బంధచ్యుతి, కొరకగు'

(ఆముక్తమాల్యద 3-86)

'జాఱునలము తేనియ, గారయిచ్చి'

(పాండురంగమాహాత్మ్యము 5-294)

'మఱియును-యె,వ్వరు-సురుచిర-చె,చ్చెర'

(భాగవతము 4-520)

ఇట్లు లక్షణమున కఠినతముగ ర-ఱలకు యతిప్రాసలు చెల్లెడి లక్ష్యములు క్రమముగ నధికము కాజొచ్చినవి. "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్" అనెడి చింతామణి సూత్రమును గతానుగతికముగ లాక్షణికు లనుసరించుట తటస్థించినది. కాని ర-ఱల ఉచ్చారణములోని అభేదమును గుర్తించియు, కావ్యములందధికముగు చున్న అభేద యతిప్రాసల లక్ష్యములను పరిగణించియు ర-ఱలకు యతిప్రాస మైత్రులు చెల్లునని లాక్షణికులు చెప్పవలసియున్నది. ఇట్టి లక్షణమును చెప్పుటయే సమంజసము. కావున దీనిని అప్పకవి అగ్రాహ్యమని చెప్పవలసిన యక్కరలేదని తెలియుచున్నది.

## అప్రశస్త ప్రాసము

ఏ యక్షరమున కా యక్షరముతోనే మైత్రి చెల్లించుట ప్రాసకు సాధారణ లక్షణము. యతిలోవలె ప్రాసలోను ఒక అక్షరమునకు మరొక అక్షరముతో మైత్రి చెల్లింపదగినవి ప్రాస భేదములుగా చెప్పబడినవి. అప్పకవి ఆ విధముగా అంగీకరింపని ద-డల ప్రాసను అప్రశస్త ప్రాసము క్రింద చెప్పినాడు.

ఆ. అప్రశస్తములగు ప్రాసజాలము లలం
కార విస్మితములు గావు గాన

దివిరి ధూర్తులైన •కవులు కల్పనఁ జేసి
యొప్పిదంబు లనుచుఁ •జెప్పరాదు.

అప్పకవీయము (3-378)

మహాకవులు ప్రయోగింపనివియు, లక్ష్యబాహుళ్యము లేనివియు, లక్షణ గౌరవము నొందనివియునైన యతులను అప్పకవి అగ్రాహ్యములని చెప్పినట్లు, ప్రాసలను అప్రశస్తము లనుచున్నాడు. అటువంటి అప్రశస్తములైన ప్రాసలు కావ్యమున కలంకారప్రాయమైనట్టివి కావు. లక్షణమును గౌరవింపని కొందరు కవులు (ధూర్తులు) ప్రయత్నించి, అట్టివానిని యోగ్యములైన వానిగా భావించి కూర్పరాదని అప్పకవి చెప్పుచున్నాడు. ఈ పద్యమునందు అప్రశస్తములైన ప్రాసలేవియో చెప్పబడలేదు. క్రింద ఉదాహరింపబడిన లక్ష్యములనుబట్టి ద-డల ప్రాస మొక్కటియే అప్రశస్తమైనదగుచున్నది. దీనిని సూచించి, ఇటువంటి అప్రశస్తప్రాసలను ప్రయోగింపరాదని భావించి అప్పకవి యీ పద్యమును చెప్పినట్లూహింపనగును.

ఉ. కందుక కేళి సల్పెడు ప్ర•కారమునం బురుషాయిత క్రియా
తాండవ కేళి సల్పెడు వి•ధంబునఁ బాపర భామ లేఁత నీ
రెండఁ బ్రభాతవేళ రచి•యించెను గుబ్బలమీఁది హారశుల్
కుండలము లుక్కరు ల్గదల •గోమయ పిండము లింటి
ముందటన్

(వీధి నాటకము) - అప్పకవీయము (3-379)

చ. కదుకొని వేడిబాష్పములు •గ్రమ్మి పయింబడి పర్వ భీతిమై
నదరుచు విన్ననైన హృద•యంబునఁ బొల్పగు హారయష్టి ప
య్యెద దడియంగఁ గానఁబడి •యంచిత నిర్మల రత్న
భూషలన్
దదుదిత దృశ్యమాన మణి•ధామ సముజ్జ్వలభాతి దోఁపఁగన్
(భాస్కరరామాయణము. యుద్ధ కాండము2356)-అప్పకవీయము(3-380)

ఇందు మొదటి పద్యమున 'కందు-తాండ-తెండ-కుండ, అని యుండి ంద-ండలకు ప్రాస చెల్లింపబడినది. రెండవ పద్యమున 'కదు-నద-య్యద-దదు' అనియుండి కేవల ద-దలకు ప్రాస చెల్లింపబడినది. అప్పకవి చెప్పిన ప్రాసభేదములచే నివి సాధింపబడకుండుటచే అప్రశస్త ప్రాసము లగుచున్నవి. కేవల ద-దలకు యతిప్రాసలు రెండును చెల్లుననెడి లక్షణ పద్యము నొకదానిని అప్పకవి అగ్రాహ్యసంబంధవళి (3-264) క్రింద పేర్కొని ఖండించినాడు. ల-దలకు, శ-దలకు ప్రాసమైత్రి నంగీకరించి నప్పుడు; ద-దలకును అభేదప్రాసము నంగీకరించుటలో వైపరీత్యము కానరాదు. ఈ ద-దలయొక్క అభేదమైత్రి, పైని చెప్పబడిన అగ్రాహ్య సంబంధవళిక్రింద నిరూపింపబడినది(పుట - 84). ద-దల కభేదము నంగీకరించి, అభేద ప్రాసమునందు ల - దలతో పాటు దీనినికూడ చెప్పుటయే సముచితము. కేవల ద-దలకు ప్రాసమైత్రి చెప్పినచో బిందు పూర్వక ద-దలకు వేరుగా చెప్పనవసరములేదు.

మొదటి పద్యమునగల 'కందుక' శబ్దమునకు 'కండుక' శబ్దము రూపాంతరము. ముద్రితమైన క్రీడాభిరామములో 'కండుక' శబ్దమే యుండుటచే సమప్రాసము చెల్లింపబడినట్లగుచున్నది. రెండవ పద్యమున గల 'కదుకొని, అదరుచు' అనువానికి ముద్రిత భాస్కర రామాయణమున ద-దల ప్రాసలకవకాశములేని 'కదుకొని, అదరుచు' అనియున్నది. అప్ప కవీయ లక్షణములు ప్రామాణికములగుటవలన, ద-దల ప్రాస మలాక్షణిక మను తలంపుతో పై లక్ష్యములు సవరింపబడి యుండెను. కాని అప్పకవి యుదాహరించిన ట్లాపద్యమును ద-దల ప్రాసతోడనే గ్రహించి, వాని కభేదప్రాసము నంగీకరించినచో సముచితముగా నుండెడిది.

లక్షణశిరోమణి యందు ద-దలయొక్క అభేదప్రాసకు లక్షణము చెప్పబడక, ఈ దిగువ లక్ష్యము మాత్రము చూపబడినది (4-169)

క. గాండీవధరుని యాహవ
పాండిత్యముఁ దలఁప నతని ఖండనమున మా
ర్కొండునని యొకఁడు గడఁగుట
కొండంగని తగరు దాఁకఁ గోరుట గాదే।

-ఉద్యోగ పర్వము (1-237)

ముద్రిత సంశోధిత భారతమున 'మార్కొందు' ననెడి సమప్రాస చెల్లిన పాఠము కలదు. అప్పకవీయమున (2-147) గల

"డిండీర దీప్తి పోఁడిమి మీరునీకీర్తి
దిండీర పాండిమఁ దెగడు నవ్వ....,

అంచు నీపద్యమునఁ జరణాదులందు
నిలుపు పదముల మొదలను గలుగు వ్రాలు
దత్వ దత్వంబులందు రెంటను బొనంగు
శాబ్దిక మయంబునను వనజాత నయన।"

అనెడి పద్యము పేర్కొనబడి "...... దదలున్న రెండు విధములు గల వని చెప్పిరి......" అని సుకవి మనోరంజనమున కలదు (1 - 298). కొన్ని పదములందు ద-డల కభేద మంగీకరింపబడుటవలనను; ల-డల కభేద ప్రాసను చెప్పు సందర్భమునం దీవిషయము ప్రస్తావింపబడుట వలనను; ద-డల అభేదప్రాసమునకు కూచిమంచి వేంకటరాయకవి విముఖుడుకాదని తెలియుచున్నది. ప్రత్యక్షముగ దీనికి లక్షణ మెందును చెప్పబడలేదు. కాని పైలాక్షణి కాభిప్రాయములనుబట్టి, ద-డల ప్రాసము నప్రశస్తమని నిరసింప వలసిన పనిలేదని నిర్ణయింపవచ్చును.

ఈ పరిశీలనమువలన నిట్టి నిర్ణయములను చేయదగును.

1. అగ్రాహ్యవర్గవళి, అగ్రాహ్యవర్గ చతుష్టయవళి అను రెండింటిని అగ్రాహ్యవళులుగా చెప్పవలసిన ఆవశ్యకము కలదు.

2. అగ్రాహ్య సంబంధవళిని; అగ్రాహ్యేతరవర్గ యతిలోని వ ప బ భ మ వల మైత్రిని; అగ్రాహ్యేతరయతిలోని ల-ళల మైత్రిని, ర-లల మైత్రిని, ర-ఱల మైత్రిని; అప్రశస్తప్రాసములోని ద-డల ప్రాసమైత్రిని స్వీకరింపవలసి యుండుటచే, వానిని అగ్రాహ్యవళి, అప్రశస్తప్రాసముగా చెప్పవలసిన ఆవశ్యకము లేదు.

—:※:—

# రేఫము, అలఘు రేఫము - వర్ణాంతర రేఫము

'యరలవ'లు అంతస్థములు. అంతస్థములనగా మధ్యస్థముగా నుండునవి యని యర్థము. ఇవి స్వరములకు, స్పర్శములకు మధ్యగా నుచ్చరింపబడునవి యగుటచే వీనికీ పేరు కల్గెను. వీనికి లఘువులు, అలఘువులు అనెడి రెండురూపములు కలవని వ్యాకరణము చెప్పుచున్నది.[1] స్థానకరణ సంయోగమున గల శిథిలత్వమున లఘువులు, అశిథిలత్వమున అలఘువులు పుట్టును. అనగా నీలఘ్వలఘు విభజనమునకు ఉచ్చారణములోని సారళ్య పారుష్యములు కారణమని తెలియదగును. లఘ్వలఘుత్వము య, వ లకు సంస్కృత వ్యాకరణమున చెప్పబడినది; ప్రాకృత వ్యాకరణమున లకారమునకు కూడ అంగీకరింపబడినది; ఇక మిగిలిన రేఫముకూడ ద్వివిధమని ఈ తెలుగు వ్యాకరణమున గ్రహింపబడు చున్నది; అనునది చింతామణి సూత్రమునకు బాలసరస్వతి వ్యాఖ్య.[2]

తెలుగులో సంహితయందు య, వల కాగ మాదేశత్వములు కలవు. కాయ, వంట మొదలగువాని యందలి శబ్దగతమైన య, వల కంటె;

---

1. "యరలవలు లఘువులని, యలఘువులని ద్వివిధంబులగు." బాల వ్యాకరణము-సంజ్ఞా 18.
2. "లఘవోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థాన్వదంతి శాస్త్రః అన్యేఽన్య వ్యాకరణస్పష్టా; రస్త్వత్రగృహ్యతే ద్వివిధః" (బాలసరస్వతి వ్యాఖ్య) - చింతామణి, సంజ్ఞా 16

హరియతడు, అతడు వలికె మొదలగువానియందలి య, వలు శిథిలోచ్చార ణముకలిగి యున్నవి. కాగా య, వలు సహజముగ శబ్దగతమైనవి యగుచో నలఘువులు, సంధియందాగమాదేశాత్మక మైనవియగుచో లఘువులు నగు చున్నవి. హరి + అతడు → హరి యతడు, అతడు + పలికె → అతడు వలికె అనెడి రూపములందు లేఖన చిహ్నములను ప్రధానముగా గ్రైకొనరాదు. ఇచ్చట ఉచ్చారణము లోని భేదమును బట్టి ధ్వని భేదమేర్పడుచున్నది. అనగా పరిసర వర్ణములపై నాధారపడిన ఉచ్చారణ సారళ్యమును పురస్క రించుకొని క్రమముగ యకారాగమము, వకారాదేశము నగుచున్నవి. దీని వలన అర్థ భేదమేర్పడుటలేదు. అర్థభేదన సమర్థమైనట్టి ధ్వని రూపమే వర్ణమగుచున్నది. కాగా అగమాదేశాత్మకము, లఘురూపమునైన య్, వలు వర్ణములుకాక అవి సహజము, అలఘురూపమునైన య, వ లకు సవర్ణములు లేక ఉపవర్ణము లగుచున్నవి. వీనిని అప్రధాన వర్ణములని కూడ ననదగును. అనగా అలఘు య, వలు ప్రత్యేక వర్ణములు; లఘు య,వలు వాని సవర్ణములు. ఈ కారణము వలననే లఘ్వలఘు య, వల కొకే విధమైన లేఖన చిహ్నము లేర్పడినవి. ఇచ్చట ప్రధాన మైన వర్ణము యొక్క లిపి రూపమే అప్రధానమైన వర్ణమునకు కూడ గ్రహింపబడనదని గుర్తింపనగును.

ర, ల లకు చెప్పబడిన లఘువు, అలఘువు అనెడి రెండు రూప ములను శబ్దగతమైనట్టివే. బాలవ్యాకరణకర్త ననుసరించి లకారమున కలఘు రూపము బహుత్వమునందు ర, ల, డల కాదేశమైన శకార మగుచున్నది (త్రాళులు). రేఫ కట్లు చెప్పబడలేదు. వీని లిపి యందు లఘువులకు ర, ల లనియు; అలఘువులకు ఱ, ళ లనియు ప్రత్యేక లేఖన చిహ్నములు కలవు. ఈ విధముగ భిన్నములైన లేఖన చిహ్నము లుండుటయే ప్రత్యేక వర్ణత్వమున కొక నిదర్శనము. ప్రత్యేక వర్ణ ములు కానిచో ప్రత్యేకమైన లేఖన చిహ్నము లేర్పడుటయం దర్థము లేదు. లఘువులైన య, వలకు ప్రత్యేక లేఖన చిహ్నములు లేకపోవుట కూడ, నవి ప్రత్యేకవర్ణములు కావనెడి నిర్ణయమున కొక కారణమగు

మున్నది. సహజ య, వలు అలఘువులు కాగా, ఆగమాదేశాత్మక మైనవి లఘువులగుచున్నవి. దీనికి విరుద్ధముగ లకారమునకు సహజ మైనది లఘువుకాగా ఆదేశమైనది అలఘువగుచున్నది. రేఫకు చెప్ప బడలేదు కాని, లకారమునకు వలె నూహింపవచ్చును. దీనినిబట్టి అంతస్థము లందు య, వ లొక తరగతికి; ర, ల లొక తరగతికి చెందుచున్నవని తెలియుచున్నది.

ఇచ్చట య, వ ల లఘ్వలఘు రూపములు స్పష్టమగుటచే ల, ళలను గూర్చియు; ర, ఱలను గూర్చియు పరిశీలింపవలసి యున్నది.

ల - ళలు :-

వైయాకరణులును, ఛందోవేత్తలును వర్ణసమామ్నాయమునందు ల, ళలను భిన్నవర్ణములుగా పేర్కొనిరి.[3] చింతామణి ననుసరించి బాల వ్యాకరణకర్త ల, ళలను భిన్నవర్ణములని చెప్పి; య ర ల వలను లఘ్వ లఘువులని ద్వివిధముగా పృథక్కరించెను.[4] ఏకుల, పాకుల, బ్రాకు లందలి ళకార మలఘువు. తల, నెల యిత్యాదులందలి లకారము లఘువు. వరసమామ్నాయగత ళకార మలఘువు కాదు. అది ప్రత్యేక వర్ణము. అనం తురు వర్ణసమామ్నాయమునందు ళకారమును జేర్చక; సంస్కృత భాషలో ల, ళలకు భేదము లేదనియు, తెలుగుభాషలో మాత్రము ళ వర్ణము (ల వర్ణములోపాటు) అధికముగా కలదనియు చెప్పెను.[5] సంస్కృతమునందు

---

3. "... య ర ల వ సహళంతు హల్వర్గః" -చింతామణి (1-6)
4. బాలవ్యాకరణము (1-3, 18)
5. ఛందోదర్పణము (4-126)

క. ళలలకు భేదము లేదను
పలుకున కాఁ దొలఁగి యెదు ♦పడులగు వర్ణం
బులు సంస్కృతభాషకు, మఱి
తెలుఁగున ఱ ళ లనఁగ రెండధికమం్రదు హరీ!

-ఛందోదర్పణము (4-127)

ల-ళలకు లఘ్వలము భేదము లేదు. వ్యాళ, గోళాదులందున్నట్టి అలఘు లకారము అర్వాచీనమని సంస్కృత వైయాకరణుల మతము.[6] ఏకనీళము, దేవహేళనము మొదలైన శబ్దము లందలిది దుఃస్పృష్టడకారముగ చెప్పబడి నది. ఇది కొన్ని వేదశాఖలందు మాత్రము ళకారముగా పఠింపబడుచున్నది. ఇదియు నర్వాచీనమే.[7]

ఇట్టి విధమైన లాక్షణిక వాక్యములనుబట్టి తెలుగులో భిన్నవర్ణములగు ల-ళలు, ఒక అలఘు లకారము కలవని తెలియుచున్నది.

కల, వల మొదలగువాని యందలి లకారము దంతమూలీయము, పార్శ్వికము. ఇదియే లఘు లకారము.

తళుకు, కూళ, గయ్యాళి మొదలగువాని యందలి ళకారము మూర్ధ న్యము, ప్రత్యేక వర్ణము.

ఏళులు, పాళులు, త్రాళులు మొదలగు వానియందలి ళకార మలఘువు. అనగా బాలవ్యాకరణకర్త ననుసరించి ఈ ళకారము బహుత్వము నందు ఙ, ల, డల కాదేశమైనట్టిది. ఇచ్చట 'ళ'కార మాదేశమనుటచే అలఘు లకారముకూడ మూర్ధన్యమగుచున్నది. దీనికి వర్ణముయొక్క లేఖన సామ్యమొక ఆధారము. చింతామణిలో చెప్పబడినట్లుగా అప్పకవి పేర్కొని నట్టి అలఘులకార లిపి చిహ్నము (ꠋల)[8] వ్యాప్తినొందకపోవుట కాయలఘు లకారము మూర్ధన్యళకారముతో నభిన్నమైయుండి దాని లిపి చిహ్నమే స్వీకరింపబడి వ్యాప్తినొందుట కారణము.

అలఘు లకారమునకు ప్రత్యేక వర్ణత్వము లేదు. ఇది మూర్ధన్య ళకారోచ్చారణమున లీనమగుటచే స్థూలముగ ల-ళ లనెడి రెండు వర్ణములే

---

6. వైయాకరణ పారిజాతము. పుట-170.

7. ద్రావిడభాషా పరిశీలనము-I విషయము-IX

8. "దంత్య చజౌ గురు రలౌ చబిన్దు యుతౌ" -అప్పకవీయము

ఏర్పరుచున్నవి. తరువాత ప్రత్యేకవర్ణమగు ళకారమే లకారమున కలఘు రూపమనియు చెప్పవచ్చును. తెలుగులో కల-కళ మొదలగువానియందు ల, ళలు అర్థభేదక సమర్థములై ఒకదాని స్థానమున వేరొకదానిని స్వీక రించుటకు వీలులేని ఎగుచున్నవి.[9] అయినను ల, ళలకు యతిప్రాస మైత్రు లంగీకరింపబడినవి. అర్వాచీన సంస్కృతమునందు ల, ళ లభిన్నము లగు టచే, తత్ప్రభావమువలన తెలుగున మైత్రి చెప్పబడినదని యూహింప నగును.

ర - ఱ లు :-

చింతామణిలో శకటరేఫము లేకయే అచ్చతెలుగు వర్ణములు ముప్పదియారని చెప్పబడినట్లు బాలసరస్వతీయపాఠము.[10] దీని ననుసరించి బాల ప్రౌఢ వ్యాకరణములందు య,ర,ల,వ,ళ లనెడి వర్ణములే గ్రహింప బడినవికాని శకటరేఫము ప్రత్యేక వర్ణముగా గ్రహింపబడలేదు. తరువాత చింతామణి ననుసరించి బాలవ్యాకరణమున య,ర,ల,వ లకు అల్ప లఘువు లనెడి రెండు రూపములు కలవనియు, ప్రత్యేక వర్ణముగా గ్రహిం పని శకటరేఫము రేఫమున కలఘురూపమనియు ప్రకటింపబడినది.[11] లఘ్వలఘువులైన య,వ,ల లకు వైరర్థ్యములేదు, రవర్ణములకు నిత్య ముగా కల్ల[12]దనెడి చింతామణి సూత్రమునకు "వై రర్థ్యమనగా

---

9. వ్యవహారమున శకారమునకు లఘులకారరూప మేర్పడుట యొక మాండలికము.

10. శ్లో. "ద్వివిధా దిరు దేదో ఓఓ చో వక్రతమావనుస్వారౌ
కగ చజయుగ టడణ తదన పబమ యరలవ సహాళంతు హల్వర్గః"
- బాలసరస్వతీయము (1-13)

11. బాలవ్యాకరణము (1-18)

12. "నాన్యేషాం వై రర్థ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్"
- చింతామణి (1-10)

బరస్పరము యతిప్రాసలు చెల్లకుండుట" యని బాలసరస్వతి వ్యాఖ్య.[13] అథర్వణ కారికావళియందు లఘ్వలఘు రవర్ణములయొక్క విభేదము ప్రకటింపబడి వాని యతిప్రాస మైత్రులు తిరస్కరింపబడినవి.[14]

శకటరేఫముతోకూడి (రయుగ) తెలుగునకు ముప్పదియేడు వర్ణము లని అప్పకవీయ చింతామణి పాఠము.[15] అనంతామాత్యుడు వర్ణమాలను పేర్కొనుచు సంస్కృతమునలేని ఱ, ళ లనెడి రెండు వర్ణములు తెలుగులో నధికముగా కలవని వ్రాసెను.[16] ఛందోలాక్షణికు లెల్లరును ఎక్కటివడి, ప్రాసవైరములందు ర-ఱలకు యతిప్రాస మైత్రులు నిషేధించిరి. వీనిని ఛందోగ్రంథములందు లఘ్వలఘువులని వ్యవహరింపక కేవలము ర-ఱ లనియే పేర్కొనుట నిటగమనింపదగినది. దీనినిబట్టి ల-ళలకు వలెనే ర-ఱ లున్ను భిన్న వర్ణములని తెలియుచున్నది.

పైని పేర్కొనిన లాక్షణిక వాక్యములనుబట్టి ర-ఱ లభిన్నము లనియు, శకటరేఫము ప్రత్యేకవర్ణము కాదనియు, ఇది సాధురేఫ కలము రూపమనియు వైయాకరణులును; ర-ఱలు భిన్నాక్షరములనియు, ప్రత్యేక వర్ణమగు శకటరేఫ తెలుగులోమాత్రమే కలదనియు, కావుననే వీనికి యతి ప్రాసలందు మైత్రి కూర్పరాదనియు ఛందోవేత్తలును అభిప్రాయపడినట్లు తెలియుచున్నది. కాగా ర - ఱల సంబంధమును ప్రకటించుటయందు వైయాకరణులును ఛందోవేత్తలును పరస్పరము విరుద్ధమైన మార్గము ననుసరించినట్లు నిర్ణయమగుచున్నది. ఈ రెండు వర్గముల వారి అభిప్రాయములందు నేకవాక్యత లోపించుటవలన శకటరేఫ స్వరూపమునందుగాని, ర-ఱల సంబంధ నిరూపణమునందుగాని ఇదమిత్థమైన నిర్ణయ మేర్పడకున్నది. శకట రేఫమును ప్రత్యేకవర్ణముగా నంగీకరింపని

---

13. బాలసరస్వతీయము (పుట- 156)
14. అథర్వణకారికావళి (13, 14, 15, 17, 19, 20, 21వ కారికలు)
15. శ్లో॥ద్వివిధా దిదుదేదోతోఽచోవక్రతమా వనుస్వారౌ,
  కగ చజయుగ టడణ తదన పబమ య రయుగ లయుగ
  వసహాళ్ళహాలః"
16. ఛందోదర్పణము (4-127)

బాలవ్యాకరణమునందే ప్రకీర్ణపరిచ్ఛేదమున 'య, వ లలు లఘ్వలఘువులు మైత్రింబొరయు, రేఫంబులు బొరయవు" (సూ-24) అని సూత్రింప బడినది. దీనినిబట్టి లఘ్వలఘురేఫములకు అనగా ర-ఱలకు యతి ప్రాస మైత్రులు చెల్లవని బాలవ్యాకరణము నందును చెప్పబడినట్లగు చున్నది. ఇది ఛందోలాక్షణికుల. మతము. కాని, వైయాకరణుల మతమున ర-ఱలు లఘ్వలఘు రూపములై యుండి, శకటరేఫము ప్రత్యేక వర్ణము కానప్పుడు వానికి యతిప్రాస మైత్రులు చెల్లుననవలయును. ర-ఱలకు యతిప్రాసమైత్రులు చెల్లనియెడల, నారెండును ప్రత్యేక వర్ణములని సుస్పషముగా తెలియుచునే యున్నది. కాగా బాలవ్యాకరణ మునందలి పై రెండు సూత్రములును పరస్పర బాధకము లగుచున్నవి. దీనికి వైయాకరణులయు, ఛందోవేత్తలయు అభిప్రాయములకు సమన్వయము లేకపోవుటయే హేతువు. ల-ళలను ప్రత్యేక వర్ణములని చెప్పి నట్లే ర-ఱలను కూడ ప్రత్యేక వర్ణములని వైయాకరణులు చెప్పవలసి యున్నది. ల-ళలకు యతిప్రాసమైత్రు లంగీకరించినట్లే ఛందోవేత్తలు ర-ఱలకు కూడ నంగీకరింపవలసి యున్నది. అప్పుడిట్టి విధమైన సందేహమున కాస్కారమే లేకపోవును. శకటరేఫ కల పదములందు దాని రూపము చెడిపోకుండ యధాతథముగ ప్రయోగించుట కవకాశము లభించి యుండెడిది.

దీనినిబట్టి బహుశః ప్రాచీనకాలమున ర-ఱలు రెండును ప్రత్యేక వర్ణములుగనే పరిగణింపబడెడివనియు; ఈ ప్రాచీన లక్షణ నిర్వహణ మునకు యతిప్రాసలు చెల్లకుండుటయు, గ్రాంథిక వాఙ్మయమునం దర్థభేదన సమర్థమును చూపుట కొకదాని స్థానమున వేరొకదానిని వ్రాయ కుండుటయు నియమములైనవనియు నూహింపవచ్చును. అనంతర కాలమున శకటరేఫము సహజవర్ణత్వమును కోల్పోవుట, ఉచ్చారణమున రేఫమునకు సన్నిహితమగుట, ఈ రెండింటికి లఘ్వలఘువులనెడి

పరిగణనము కలుగుట అనునవి జరిగి యుండవచ్చుననియు కూడ నూహింప వచ్చును.

అలఘు లకారము శకారముతో సామ్యోచ్చారణము కలిగి యుండుట వలన, దానికి శకార లేఖన రూపమే గ్రహింపబడి వ్యాప్తి నొందినదని పూర్వము చెప్పబడినది. ఇక శకటరేఫ మెట్లు అలఘురేఫ మైనదో పరిశీలింపవలయును. అకారమునకు ప్రత్యేక లేఖన రూప ముండుటయే దాని ప్రత్యేక వర్ణత్వమున కొక నిదర్శనము. అందుచే నలఘు రేఫమును, అ వర్ణమును ప్రాథమికముగా భిన్నములగుచున్నవి. అలఘు లకారమునకు శకార సామ్యోచ్చారణ ముండినట్లు, అలఘురేఫ మునకును అకార సామ్యోచ్చారణముండి యుండ వచ్చును. అలఘు లకారమునకు శకార లేఖన రూపము గ్రహింపబడినట్లు అలఘు రేఫమునకును అకార లేఖనరూపము గ్రహింపబడినదని యూహింప వచ్చును. దీనినిబట్టి లకారమునకు వలె రేఫమునకును లఘు రేఫము, అలఘు రేఫము, వర్ణాంతరమైన అ వర్ణము అనెడి మూడు రూపములు కలవని నిర్ణయమగుచున్నది. ఇట్టి నిర్ణయమునకు వ్యాకరణమునం దలఘు రేఫమునకు ప్రత్యేక లేఖన చిహ్నముండుటయు, 'దంత్య చజౌ గురురలౌచ బిందుయుతౌ' అనెడి అప్పకవీయ చింతామణి సూత్ర మును ఆధారములు. అలఘు ల- రలు క్రమముగ శ-అలతో సామ్యో చ్చారణము కలిగియుండుటవలన, లేఖనమునకు కూడ నవియే గ్రహింప బడుట శాస్త్రీయమైయుండి, అప్పకవి చెప్పిన లేఖన విధానము ప్రచార మున కెక్కక పోవుటకు హేతువగుచున్నది. ఈ ల..రల రూపములను వివరణార్థమిట్లు చూపవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| లఘువు- | ల | | ర | |
| అలఘువు- | ౢ | శ | ఱ | అ |
| ప్రత్యేకవర్ణము- | శ | | అ | |

ఇట్టి పరిశీలనముచే రేఫము, అలఘురేఫము, వర్ణాంతరమైన ఱకారము అని మూడు విధములుగ రేఫముండిన ట్లూహింపదగి యున్నది. రేఫము అంతస్థము. వేరైన అలఘు రేఫముండుటచే నిది లఘురేఫమగుచున్నది. అలఘురేఫము, ఱకారముల కొకే లేఖన రూపము ప్రచారమునందుండుటవలన నీ రెండింటిని వేరుచేసి నిరూపింపవలసియున్నది. ఱ వర్ణము ప్రాచీనకాలమున ట-త మధ్యస్థోచ్చారణము కలిగియున్న ప్రత్యేక వర్ణమనియు, దీని కనంతరకాలమున నలఘు రేఫోచ్చారణము కలిగినదనియు నిరూపింపబడియున్నది.[17] ప్రాథమికముగ ఱ వర్ణము ప్రత్యేక వర్ణమైన హేతువుచే ప్రాచీనకాలమున ర-ఱలకు యతిప్రాసలందు మైత్రి లేకుండియుండవచ్చును. కాలక్రమమున ఱ వర్ణమున కలఘురేఫోచ్చారణము కలుగుటవలన, అలఘురేఫమునకు సన్నిహితమైన లఘురేఫమునకు కూడ ఱ వర్ణము సన్నిహితము కాజొచ్చినది. ఈ విధముగ ఉచ్చారణమున రేఫ, ఱ వర్ణములకు కూడ నభేదము ప్రాచురమగుటచే వీని ప్రత్యేక వర్ణత్వము నిలుపుటకు; యతిప్రాసములందు వీనికి మైత్రి కూర్పరాదని ప్రాచీనచ్ఛందోవేత్తలు శాసించిరి. పరంపరానుగతముగ నీ లక్షణమును ఛందోలాక్షణికు లనుసరించిరి.

ర-ఱల కభేద మేర్పడుట యనునది రెండు దశలలో జరిగి యుండవచ్చును. మొదటి దశలో ఱ వర్ణమునకు అలఘు రేఫోచ్చారణము కలిగినది. ఈ సామ్యముచే లేఖన చిహ్నములేని అలఘు రేఫమునకు ఱ వర్ణ లేఖన చిహ్నమే ప్రచురమైనది. కాగా ఱ వర్ణ లేఖనముతో వ్రాయబడు పదములలో నెచ్చట సహజ ఱ వర్ణము కలదో, ఎచ్చట అలఘు రేఫముకలదో అనెడి నిర్ణయ మసాధ్యము కాజొచ్చినది. ఈ విధముగ నీ వర్ణములు ర = లఘు రేఫము, ఱ = ఱకారము లేక అలఘు రేఫము అని రెండుగ నేర్పడినవి. తరువాత క్రమముగ ఱ వర్ణమునకు సహజమైన ట-త మధ్యస్థోచ్చారణము సంపూర్ణముగ నశించి దాని కెల్లెడల నలఘు రేఫోచ్చారణమే ఏర్పడినది. బహుశః ఈస్థితి యందే ఱ వర్ణమునకు లేఖన రూపము, అలఘు రేఫధ్వని అనెడి లక్షణములనుబట్టి శకటరేఫమను నామము కలిగి యుండ

---

17. ద్రావిడ భాషా పరిశీలనము (పుట-93)

వచ్చును. ఱ వర్ణమునకు శకటరేఫము; అలఘురేఫ మనునవి వ్యవహారమున పర్యాయ నామములైనవి. దీనిని రెండవ దశగా చెప్పవచ్చును. తరువాత నలఘురేఫము క్రమముగ లఘురేఫముతో నభేదత నొందజొచ్చినది. ర-ఱల యభేద పరిణామమున నేడు నెలకొనియున్న లక్షణమిదియే.

ఛందశ్శాస్త్రమున ఱ వర్ణమును అలఘు రేఫముగా పేర్కొన కుండుటయు, ర-ఱలకు యతి ప్రాస మైత్రులు చెల్లవనుటయు ప్రాచీన లక్షణ మగుచున్నది. వ్యాకరణమున ఱ వర్ణమును అలఘురేఫ మనుటయు, దీనిని ప్రత్యేక వర్ణము కాదనుటయు నర్వాచీన లక్షణమగుచున్నది. ఱ కార మును ప్రత్యేక వర్ణమనియు, అలఘురేఫ వేరైనదనియు చెప్పుటకుగల ప్రబల హేతువిదియే. అరదము, కరణి, వెదురు, రచ్చ మొదలగు పదముల లోనిది రేఫమనియు; ఱఱచుట, ఱంపము తూఱు, ఈడేఱు మొదలగు పదములలోనిది సహజ ఱ వర్ణమనియు ప్రకటితమైయున్నది. కాగా పైని చెప్పబడిన అభిప్రాయము ననుసరించి అలఘురేఫను నిరూపించి, అది వచ్చు పదములను చెప్పవలసియున్నది.

అలఘురేఫముయొక్క సహజ స్వరూపమును తెలిసికొనుట కీక్రింది రీతి నూహింపవచ్చును. బాలవ్యాకరణమున బహుత్వమునందు ర, ఱడల కాదేశమయిన శకార మలఘురూపమని చెప్పబడినట్లుగా, ప్రాథమికముగ భిన్నాక్షరమైయుండి ఉచ్చారణమునం దనంతర కాలమున రేఫముగా మారినదానిని అలఘురేఫమని చెప్పవచ్చును. ఒకానొక వర్ణమున కిట్టి విధమైన పరిణామ మేర్పడునాటికి, ఆ వర్ణముయొక్క ఉచ్చారణమునకూడ మార్పు సంభవించి, రెండింటి ఉచ్చారణమున సామ్యముండుటచే ఆ వర్ణ లేఖన రూపమే దీనికిని గ్రహింపబడి యుండవచ్చును. అలఘురేఫమునకు సహజమైన లేఖనరూపము లేకపోవుటచేతను, అలఘులకార సామ్యమును బట్టియు నిట్లూహింపనగును. ఇట్టి అభిప్రాయముచే ప్రాచీనకాలముననున్న ఱ వర్ణము, అర్వాచీనకాలమున కొన్ని తావులందు రేఫముగా మారినట్టి అంశమును గుర్తింపవచ్చును. అట్టి రేఫ మలఘురేఫము కాగలదని యిచ్చట ఊహింపబడుచున్నది.

ఱ వర్ణ మనంతర కాలమున డ, ద, ళ, ల, ర, ఱ అను వానిలో నేదో యొక రూపములో కనబడుచున్నది.[18] అనగా ఱ వర్ణమునకు ర ఱలను రెండు రూపములు కనబడుటచే ఱ వర్ణమునుండి యొక విధమైన రేఫ ముత్పన్నమైనట్లు తెలియుచున్నది. ఈ రేఫ మలఘు రేఫమని యిచ్చట ప్రతిపాదింప బడుచున్నది. ఱ వర్ణము ర-ఱలనెడి రెండు రూపములుగా మార్పు నొందినదని చెప్పబడుటకు ఱకారము ముందలఘు రేఫముగను తరువాత లఘురేఫముగను మార్పు నొందినదని యూహింప వచ్చును. లేదా భిన్న రేఫములలోని అర్వాచీనమైన యభేద కారణముచే శాసనములందు యథేచ్ఛముగా ప్రయోగింపబడి యుండవచ్చుననియు నూహింపవచ్చును. శాసన రూపములనుబట్టియు, వాని తమిళ రూపములనుబట్టియు ఱ కారము వచ్చు పదములలో జరిగిన మార్పు నిట్లు చూపవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| పుఱోలు | - | ప్ఱోలు | - | ప్రోలు |
| కీఱ్న్ద | - | క్ఱింద | - | క్రింద |
| మిఱింగు | - | మ్ఱింగు | - | మ్రింగు |
| పొఱుదు | - | ప్ఱొద్దు | - | ప్రొద్దు |
| కొఱవు | - | క్ఱొవ్వు | - | క్రొవ్వు |
| ముఱంగు | - | మ్ఱోగు | - | మ్రోగు[19] |

18 ప్రాఙ్నన్నయ యుగము (పుట-53)

19 ఈ సందర్భమున "ఈ విధముగాఁ గొన్ని తెలుఁగు పదముల (వ్రేలు, ప్రాఁత, మ్రోఁను, ప్రోలు, క్రోవి, త్రిప్పు) మొదట సంయుక్తాక్షరము లలో ద్వితీయాంగముగాఁ గనఁబడు రకారము పదాది నున్న రెండక్షర ములలోని స్వరముల వ్యత్యయముచే నేర్పడినదేకాని సహజము కాదనియు, నిది మూలపదము నందలి ఱకారము పొందిన పరిణామ రూపమనియు గ్రహింపవచ్చును."(ప్రాఙ్నన్నయ యుగము. పుట-159) అని ఆచార్య శ్రీ అవధానిగారు వ్రాసిరి.

దీనినిబట్టి పైత్తావులలో వర్ణవ్యత్యయముచే నేర్పడిన క్రావడి కిటకారమే మూలరూపమని తెలియుచున్నది. ఈ పదములలో ఱకార పరిణామమున శకటరేఫము కనబడుటవలనను; క్రింద-కింద, ప్రొద్దు-పొద్దు, మ్రోగు-మోగు అని లఘురేఫము లోపించిన రూపము లేర్పడుచుండుట వలనను; ఱ వర్ణము నుండి యుత్పన్నమైన రేఫమే అలఘురేఫమనియు, పరిణామమున లోపము సిద్ధించుటయే దీనికి వర్ణత్వము లేకపోవుటకు గల కారణమనియు నూహింపవచ్చును.

తెలుగునకు సోదర భాషయు, రమారమి క్రీస్తు శకారంభము నుండి సారస్వతము కలదియునగు తమిళములోని వర్ణములను పరిశీలించిన, తెలుగులోని రేఫములకు సంబంధించిన పూర్వచరిత్ర తెలియగలదు. తమిళమున వల్లినం (పరుషములు), మెల్లినం (సరళములు), ఇడైయినం (అంతస్థములు) అని మూడు వర్గములు కలవు.[20] ఇందలి వల్లినం వర్గాంతము నందలి ఱకారము తెలుగులోని ఱవర్ణమని (సహజ శకటరేఫము)గుర్తింపబడినది.[21] ఇదియే ప్రాథమిక దశలో ట.త మధ్యస్థోచ్చారణము కలిగియున్న పరుషాక్షరము. మెల్లినం వర్గాంతమందలి నకారము (alveolar nasal) పదాంత నకారము(అవన్, ఇవన్). ఇది తెలుగు శాసనములందు న్ఱ అనెడి రూపమున నుండి నట్లును, తరువాత లోపించినట్లును నిరూపింపబడినది.[22] ఇడైయినం వర్గాంతమందలి ఴ (ḻ) అనెడి వర్ణము శకటరేఫము వలె శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి 'సంధి' లో చూపబడినది. శాసనములందు ఴ అనెడి రూపముతో నున్న వర్ణమిదియే. ఈ వర్ణమే డ, ద, ళ, ల, ర, ఱ లలో నేదో వర్ణముగా మారినది కాని, వల్లినం వర్గాంతమందలి

---

20. వల్లినం - క చ ట త ప ఱ
మెల్లినం - ఙ ఞ ణ న మ న్
ఇడైయినం - య ర ల వ ళ ఴ
-సంధి (పుట-142)
21. అందే. (పుట-142, 3, 4)
22. ప్రాజ్నన్నయ యుగము (పుట-54)

ఱకారము కాదు. అంతస్థమైన ట వర్ణము నుండి యుత్పన్నమైన రేఫము అంతస్థమైన లఘురేఫ (సాధురేఫ) కు సంబంధించిన దగుచున్నది. అది సాధురేఫముకంటె గురూచ్చారణము కలిగియుండిన కారణముచే అలఘు రేఫ మనబడినది. దీనినిబట్టి ప్రాథమికముగ ఱ వర్ణము పరుషమనియు, అలఘు రేఫము అంతస్థమనియు తెలియుచున్నది. ర-డలు, ఱ వర్ణము ఉత్పత్తిస్థాన సామ్యము కలిగియుండినట్లు తొల్కాప్పియమున చెప్పబడినది.[24] ఱవర్ణమున కలఘురేఫోచ్చారణ మర్వాచీనముగ నేర్పడినట్లును, అలఘురేఫ, ఱ వర్ణముల కొరకు శకటరేఫ లేఖన చిహ్నమే ప్రచురమైనట్లును పూర్వము చెప్పబడినది. ఈ హేతువుచే వ్యవహారమున ర-ఱ లనెడి రెండు వర్ణములే ప్రసిద్ధి నొందినవి. కవిజనాశ్రయమున ర-ఱ లని కలదు. ఆంధ్రశబ్దచింతామణిలో ఉమ్వంలముపుత్రైన ర వర్ణము (రయోస్తు)లని కలదు. 'ఱ' కు లేఖన రూపమునననుసరించి, అది ద్విచక్ర శకటమును పోలియుండుటచేతను, దానికి రేఫోచ్చారణ ముండుట చేతను, ఈ రెండు లక్షణములను సమన్వయపరచి శకటరేఫ(బండిర) మను నామముంచబడినది. తెలుగున వ్యాకరణ గ్రంథములు వెలయు నాటికే ఱకారముయొక్క సహజోచ్చారణము నశించుటయు, దాని కలఘురేఫ ధ్వని ప్రబలమగుటయు జరిగియుండవచ్చును. ఱ వర్ణమే అలఘురేఫమనుటచేతను, దానికి శకటరేఫమను నామము కలుగుటవలనను నిది నిరూపితమగుచున్నది. తరువాత దీనికి కూడ స్వతంత్రధ్వని (అలఘురేఫధ్వని) నశించి సాధు(లఘు)రేఫధ్వనియే ప్రబలమైనది. కావుననే కొందరు కవులచ్చటచ్చట ర-ఱలకు యతిప్రాసమైత్రులు కూర్చిన లక్ష్యములు కనబడుచున్నవి. ఒకేపదము ఒకచోట రేఫతోను వేరొకచోట శకటరేఫతోను కావ్యములందు ప్రయోగింపబడుటవలన, లాక్షణికులకు రేఫ శకటరేఫలు కల పదముల పట్టికలతోపాటు, ఉభయ రేఫల నుండదగిన పదముల పట్టికను కూడ తయారు చేయవలసిన ఆవశ్యకము కలిగినది. ఇట్టివిధమైన చారిత్రక హేతువుచే నేటికి సాధు రేఫమునసరొకటే మిగిలి శకటరేఫ చర్చ అనావశ్యకమైనది.

---

24. ద్రావిడభాషా పరిశీలనము (పుట-85)

పర్యవసానముగ ప్రస్తుతమున్న శకటరేఫ మెచ్చట సహజ ఱకారమో, ఎచ్చట అలఘురేఫమో నిర్ణయింపవలసి యున్నది. దీని నీ క్రింది విధమున నూహింపవచ్చును.

## సహజ ఱకారము

1. కృదంత రూపములందును, ఔపవిభక్తిక రూపములందును, శకట రేఫ సంధులందును శకటరేఫమునకు టకారాదేశము వచ్చుచో నవి సహజ ఱకారముకల పదములు.

| | |
|---|---|
| ఊఱు - ఊట | ఏఱు - ఏటికి |
| ఓఱు - ఓటు | నూఱు - నూటికి |
| తేఱు - తేట | |

కుఱు + ఉసురు — కుట్టుసురు

చిఱు + ఎలుక — చిట్టెలుక

2. తెలుగులో శకటరేఫము కల పదములకు తమిళమున సమాన పదములలో కూడ శకటరేఫమున్నచో నవి సహజ ఱకారముకల పదములు.

| తెలుగు | తమిళము |
|---|---|
| కూఱు (నింద) | కూఱు |
| మాఱు (ప్రతి) | మాఱు |
| వేఱు (అన్యము) | వేఱు |
| అక్కఱ (అపేక్ష) | అక్కఱై |
| అఱ (గది) | అఱై |
| ఆఱు (ఉపశమిల్లు) | ఆఱు |

| | |
|---|---|
| ఆఱు (షట్సంఖ్య) | ఆఱు |
| ఈడేఱు (సిద్ధించు) | ఈడేఱు |
| ఉఱు (వర్ధిల్లు) | ఉఱు |

## అలఘురేఫము

1. సహజముగా ఱకారముకల పదములు తరువాత సాధురేఫతోగాని, శకటరేఫతోగాని ఉన్నట్లు కానవచ్చినచో నట్టిరేఫలు అలఘురేఫలని యూహింపవచ్చును.

తెలుగులో నశించు అనునర్థముకల అఱు ధాతువు(బలమఱి, ఉక్కఱి, క్రచ్చఱ)నకు సమానముగ తమిళములో అఱి అను ధాతువు కలదు.[25] దీనినిబట్టి ఱకారము శకటరేఫము(ఱ)గా మారిన రూపముతో తెలుగులోనున్నట్లు భావింపవచ్చును. కాగా బలమఱి మొ॥ వానిలోనిది అలఘురేఫమగుచున్నది. తెలుగులో లఘు రేఫముతో నున్న 'ఒళవరి' అను పదము తమిళమున 'ఉళవఱి' అను రూపములో కలదు. కాగా ఱకారము లఘురేఫముగానున్న ఒళవరి పదములోనిది అలఘురేఫమని భావింప వచ్చును.

2. వర్ణవ్యత్యయముచే, పదాది సంయుక్తాక్షరమున ద్వితీయ వ్యంజన ముగా నేర్పడిన రేఫమునకు, లోపము సిద్ధించుచున్న దైనచో నది అలఘు రేఫము.

ఉ :- పొఱుదు→ ప్రొద్దు→ ప్రొద్దు→ పొద్దు.

3. అందఱు, ఎందఱు మొదలగు వానిలోని శకటరేఫము సహజముకాక సాధురేఫమున కాదేశమైన దగుచున్నది.[26] కావున నీ శకటరేఫ మలఘు రేఫమని చెప్పవచ్చును.

---

25. ప్రాఙ్నన్నయ యుగము (పుట- 156)

26. "అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రు, రలకు ఱు ఱ లాదేశంబునగు." - ప్రౌఢవ్యాకరణము (శబ్ద-౮౮సూ)

"దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వకమగుచో నలఘురేఫంబగు"[27] నని వ్యాకరణ విధి యుండుటచేత 'చేకుఱు' మొదలగువానిలోనిది సహజ అకారము కాదనియు నది అలఘురేఫమనియు చెప్పవచ్చును.

ఈ విధమైన అభిప్రాయములను నిర్ధారించుటకు నన్నయభట్టారకుడు యతిప్రాసలందు ప్రయోగించిన శకటరేఫముకల పదములయొక్క పూర్వ రూపములను పరిశీలింపవచ్చును. దీనికి నన్నయ రేఫ, శకటరేఫములకు యతిప్రాస మైత్రులు కూర్చలేదనెడి లాక్షణికాభిప్రాయము కారణమగు చున్నది. ఈ విధముగ సహజ అకారము, అలఘురేఫముకల పదములను వింగడించుటకు పరిశీలనము కావించినయెడల ఈ వ్యాసమున ప్రకటింప బడిన అభిప్రాయము నిర్ధారితము కాగలదు.

—:※:—

---

27. ప్రౌఢవ్యాకరణము (ముక్తలక్షణవివేచనము- 1 సూ)

# ఉపయుక్త గ్రంథములు


1. అథర్వణ కారికావళి - అథర్వణుడు
2. అప్పకవీయము - అప్పకవి
3. అప్పకవీయ తృతీయాశ్వాస వివరణము - శ్రీ వేదుల రామశాస్త్రి
4. అప్పకవీయ భావప్రకాశిక - శ్రీ రావూరి దొరస్వామి శర్మ
5. అహోబల పండితీయము - అహోబలపతి
6. ఆంధ్రభాష : యతిప్రాసాది ఛందోవిశేషములు (అముద్రితము) - డా॥ నడుపల్లి శ్రీరామరాజు
7. ఆంధ్రభాషా వికాసము - ఆచార్య జి. జె. సోమయాజి
8. ఆనందరంగరాట్ఛందము - కస్తూరి రంగకవి
9. కవిచింతామణి - వెల్లంకి తాతంభట్టు
10. కవిజనాశ్రయము - భీమకవి
11. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
12. ఛందోదర్పణము - అనంతామాత్యుడు (తత్త్వదర్శినీ వ్యాఖ్య - శ్రీభాష్యంవారు)
13. తిమ్మకవి లక్షణసారసంగ్రహము - కూచిమంచి తిమ్మకవి
14. తెనుగు వ్యాకరణ వికాసము - డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం
15. తెలుగు ఛందో వికాసము - డా॥ కోవెల సంపత్కుమారాచార్య
16. తెలుగుభాషలో ఛందోరీతులు - శ్రీ రావూరి దొరస్వామి శర్మ
17. ద్రావిడభాషా పరిశీలనము-1 - శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి
18. నన్నయ కవిత్వము: అక్షర రమ్యత - డా॥ వి.వి.ఎల్. నరసింహారావు
19. పెద్దన లక్షణసారసంగ్రహము - చిత్రకవి పెద్దన
20. ప్రాఙ్నన్నయ యుగము - డా॥ దివాకర్ల వేంకటావధాని
21 ప్రౌఢ వ్యాకరణము - బహుజనపల్లి సీతారామాచార్యులు

| | | |
|---|---|---|
| 22. బాలవ్యాకరణము | - | చిన్నయసూరి |
| 23. బాలసరస్వతీయము | - | బాలసరస్వతి |
| 24. భాషాసారస్వతములు - దేశి | - | శ్రీ కోరాడ రామకృష్ణయ్య |
| 25. లక్షణ శిరోమణి | - | పొత్తపి వేంకటరమణకవి (శ్రీరావూరివారి పీఠిక) |
| 26. వసుచరిత్ర వ్యాఖ్యానము | - | సోమకవి |
| 27. వైయాకరణ పారిజాతము | - | శ్రీవజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి |
| 28. నంది | - | శ్రీ కోరాడ రామకృష్ణయ్య |
| 29. సుకవి మనోరంజనము | - | కూచిమంచి వేంకటరాయకవి |
| 30. సులక్షణసారము | - | లింగమగుంట తిమ్మకవి |



# CHANDO VYASAVALI

(Eight research papers on Telugu Prosody)

by

Dr. N. S. RAJU,

M.A., Ph.D., P.G Dip. in Ling.,
University of Hyderabad,
(Central University, PO)
Hyderabad-500 134.

—

Sri Satya Prachuranalu,
H. No. 9-4-84/69, Kakatiyanagar,
Hyderabad-500 008.

Printed at Srinivasa Printers, New Nallakunta, Hyderabad.